# చరిత్రధన్యులు

రచయిత:

శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి.

పబ్లిషర్సు:

రౌతు బుక్కు డిపో,

ప్రొ:- రౌతు చంద్రయ్య అండ్ సన్సు.

రాజమహేంద్రవరము.

 1954. [మూల్యము: రు 1/-

# అనుక్రమణిక.

# శాలివాహనుఁడు.

## ౧

దీపకర్ణి కొన్ని సంవత్సరములనుండి వేఁటకుఁ బోవుట మిక్కిలి తగ్గించినాఁడు. పోయినపుడైనను వెనుకటి యుత్సాహముగాని మునుపటి యుత్తేజకతగాని యతనిలో నుదయించుటలేదు. జీవితములో నేవేని దుఃఖరేఖలు పొడసూపినపుడు వానిని చెఱుపుకొనుటకై యాభూవరుఁడు వేఁట నొక సాధనముగా నుపయోగించుకొనెడివాఁడు. నేఁడు మృగయా వినోదమువలనను శాంతింపని యేదో యొక విచారము దీపకర్ణిలో దాఁగియున్నదని యూహింపవలయును.

తన తరువాత రాజ్యభారము నాదుకొను పుత్రసంతాన భాగ్యము దీపకర్ణికిఁ బట్టలేదు. అంతతో సరిపెట్టక భగవంతుఁ డాతనికి మరియొక ఘోరవిపత్తు తెచ్చిపెట్టినాఁడు. కన్నులకు వెన్నెల వత్తియైన ప్రాణేశ్వరి "శక్తిమతి" గతించినతరువాత దీపకర్ణికి లోకమెల్ల శూన్యమనిపించినది. ఆమె మరణానంతర మా ప్రభువు జీవితప్రయాణ మొకయర్థములేనిది. విషాద

మేదురమైన దీపకర్ణి హృదయమును నేఁడు వేఁటకూడ వినో దింపఁ జేయుటకుఁ జాలదుగదా!

మంత్రులకుఁ బరివారమునకుఁ బరమాశ్చర్యముగా నున్నది. మహీపాలుఁడు పూర్వములేని యుత్సాహముతో నాఁడు మృగయా వినోదమునకు బయలుదేఱినాఁడు. అవ్యక్తమైన యొకానొక యానందరేఖ యా ధరాపాలునకు స్వాగతము చెప్పుచున్నట్లున్నది. ఏలొకో! ఆనాఁడతనిలోఁ గ్రొత్త వేడుక పొటమరించినది! భవితవ్యములకు సూచనలు సర్వత్రి కానిపించుచుండును.

సపరివారుఁడైన దీపకర్ణి భూపాలుఁడు కాంతారమునఁ బ్రవేశించి విచ్చలవిడిగా వేఁట కుపక్రమించెను. ఆ నాఁటి యతని వేడుకను జూడఁగాఁ బట్టఁబగ్గములు లేవు. వరాహములను దునుమాడెను. బెబ్బులులను దూఁటాడెను. మదగజములను జెండాడెను. చిరకాలమునుండి యణఁగి యణఁగి యతనిలోనున్న మృగయా వినోదోత్సాహ మొక్కసారి యుబికి యుప్పొంగినటు లయ్యెను. ఇట్లు రెండు మూఁడు జాములా వేడుక సాగినది.

ఆ పూఁటకు వేఁట విరమింపఁ దలఁచుకొన్న సమయమున దీపకర్ణి మనస్సు నాకస్మికముగాఁ దివిచి యెవరో యాఁపినటులయ్యెను. ఆతని కన్నులు దవ్వులనున్న యొంక సింహముపైఁ బడెను. "వరాహములను బెబ్బులులను సంహ

రించుటకాదు. నన్నుఁ బోడుపు" మన్నటు లాపంచాననము వచ్చుటను దీపకర్ణి పరికించెను. సింగము కంటఁబడిన వెను వెంటనే యాధరాఖండలుని కండరములు పొంగి సర్వాంగ ములు నుద్రిక్తము లయ్యెను.

అట్టి స్థితిలో దీపకర్ణి కుత్తరక్షణమున నొక యాశ్చ ర్యము రేకెత్తెను. ఆ భయంకరమృగము మందమారుతము నకుఁ గదలాడు సరస్తరంగమువలె మెల్లఁగా వచ్చుచుండుట మఱియు నచ్చెరువు గొలిపెను. ఆశ్చర్యములో నాశ్చ ర్యము! ఆ సింహముపై నొక పసియీడు పిల్లవాఁడు కాఁ బోలు! ఆ యపూర్వదృశ్యము చూచి దీపకర్ణి పులకితుఁ డయ్యెను; చకితుఁడయ్యెను. ఫణిరాజు పడగపైనున్న మణిని దలంచుకొని, దీపకర్ణి గుండె యొక్కసారి జల్లుమన్నది. సింహము మీఁది మీఁదికి రాఁబోవుచుండెను. క్రూరమృగము నుపేక్షింప రాదని వాఁడియమ్ము వింట సంధించి యాతేఁడు సింగము మొగము గాఁడునట్లు కొట్టెను. ఆబాణము మొగముదూసికొని మృగము భూమికొరగునంతలో శరవేగమున నేఁగి పిల్లవాని మొడలు నొవ్వకుండఁ జటాలునఁ నెత్తి దీపకర్ణి ముద్దాడెను.

అంతలో నా మహీకాంతుని యెదుట దివ్యమంగళ మూర్తియగు నొక మహాపురుషుఁడు. దీపకర్ణి కది యంతయు వింతగా నుండెను. అది కలయో, మతిభ్రమయో, వైష్ణవ మాయయో యతఁ డూహింపలేకపోయెను. తాను వేఁటకు వచ్చుటయేమి! సింహముపైఁ బసిపిల్లవాఁ డుండుటయేమి!

సంతానహీనుఁడైన తన కాబాలుఁడు దొరకుటయేమి! ఈ మహాపురుష సాక్షాత్కారమేమి!

ప్రత్యక్షమైన పురుషుఁడు దీపకర్ణి భూపాలుని నిండు హృదయముతో దీవించి యిట్లు పలికెను: "మహారాజా! నేనొక యక్షుఁడను. సంతానవంతుఁడనైన నేను గారణాంతరముచే శప్తుఁడనై యిట్లు సింహారూపమున నుంటిని. వీఁడు నా కన్న కుమారుఁడు. నా పేరు సాతుఁడు. అపుత్రకుఁడవైన నీవు వీనిని పుత్రనిర్విశేషముగా భావించి పెంచుకొనుము. నీ యభిమతార్థము నెఱవేఱును. నీ మూలమున నాకు శాపవిముక్తి కలిగినది. కృతజ్ఞుఁడను. ఈ బిడ్డ సామ్రాజ్యధురంధరుఁడై శాశ్వతకీర్తి ప్రతిష్ఠల నార్జించుకొనఁ గలవాఁడు కాఁగలఁడు. మఱినాకు సెలవు."

దీపకర్ణికిఁ బెన్నిధానము లభించిన యానందము కలిగెను. సాతుఁడు వాహనముగా నుండుటచే నాపిల్లవానికి "సాతవాహనుఁడు" అను నామకరణము చేయఁబడెను.

---

## ౨

ఆంధ్రదేశచరిత్రసౌధమున సాతవాహ-
దీపమువంటివాఁడు. బాల్యము గడచిన యే
పడ, రాజనీతిజ్ఞత, సాహిత్యరక్తి మబ్బ తో

వెన్నెలవలెఁ దెలుఁగుదేశము నాల్గు చెఱఁగులలోఁ జల్లఁదనము విరియఁజేసెను. సాతవాహనునకే శాలివాహనుఁ డనియు, హాలుఁడనియు నామాంతరములు వెలసెను.

హాలనేత యెంతయాకారవంతుఁడో, అంత ప్రజ్ఞాశాలి. ఎంత ప్రజ్ఞాశాలియో, అంత గర్వరహితుఁడు. ఎంత గర్వరహితుఁడో, అంత రాజ్యకార్య ధూర్వహుఁడు.

ధాన్యకటకమున హాలమహారాజు కొలువు వసంతారామమువలె నందగించి యుండును. దేశ దేశములనుండి విద్వాంసులు, కళానిపుణులు, కవిశిరోమణులు వందలు వేలుగా విచ్చేసి హాలుని కొల్వు నలంకరించుచుందురు. హాలుఁడు కొలువుదీర్చిననాఁడు పండితుల దోసిళ్ళలో బంగారుపంట. హాలుని కటాక్షము సోఁకిన కవుల గళములకు ముత్యాల సరములు. ప్రాకృతభాషపై నాతనికిఁగల మక్కువ యింతయని వక్కాణింపరానిది. ఆ బాసలోఁ గవిత చెప్పఁగల ప్రతికవియు హాలుని గౌరవమునకుఁ బాత్రుఁ డగుచుండెను. 'కవివత్సలుఁ' డను బిరుదనామ మతనియెడల నన్వర్థమైనది.

ఒకనాఁటి కొలువులో రత్నఖచితమైన సువర్ణపీఠమున హాలనేత సురేంద్రునివలె సముపవిష్టుఁడై యుండెను. ఆతని కుడివైపు మహాతేజస్వంతులైన యిర్వురు మూర్తులుచితాసనములపైఁ గూర్చుండియుండిరి. వారి కన్నులలో నార్షతేజోరేఖాస్ఫురణములు పరిఢవిల్లుచున్నవి. గంభీర సుందరములైన

వారి వదన సరోజములలో సరస్వతి లాస్యము చేయుచున్న ట్లున్నది.

వారెవరు! మహామంత్రులై యుందురని వారి వేష సౌష్ఠవములు చెప్పక చెప్పుచున్నవి. పెదవులనుండి తొలగాడు చిఱునవ్వు కప్పుకొనుచున్నను నాతనిలో నధికార దర్పము, అహంకార చ్ఛాయ స్పష్టముగా విప్పారుచునే యున్నవి. అతఁడు ప్రధానమంత్రి 'శర్వవర్మ' కావలయును. రెండవ సచివోత్తముని ముఖములో మందహాసము లేదు. అతని కన్నులు పరమ నిశ్చల స్ఫురణములై యోగానేక తీవ్ర భావనలోనున్న యతని యవస్థను వెల్లడించుచున్నవి. అతఁడు 'గుణాఢ్యమంత్రి' కావుట సత్యము.

హాలభూపతికి వామపార్శ్వమునఁ బట్టపురాణి లీలావతి యొక రమణీయ మణిపీఠమున నుపవిష్టయై యుండెను. లీలావతి సుగుణవతియేగాక సురుచిర రూపవతి. భాస్వర తేజస్వతియే గాక సాహిత్యములో రెండవ భారతి. ఆమె మహారాజుతో పాటు కొలువుకూటమునఁ గూర్చుండి రాజకీయగోష్ఠులలో సాహిత్యచర్చలలోఁ బాలుగొనుచుండును. రాజకీయము లైన రహస్యము లామె మిక్కిలి చాకచక్యముతోఁ జక్కదిద్ది భర్త కానందము కలిగించుచుండును. సాహిత్య చర్చాసందర్భము లందామె యందెవేసినచేయి. లీలావతి చెప్పిన సాహిత్యపుఁ దీర్పులు కాదనుటకు మహారాజునకుఁగాని, మహాపండితులకుఁ

గాని గుండెదిటవుండను. ఆమెమాట లెంత మధుర మధుర ముగా నుండునో, అంత వాఁడివాఁడిగాఁ గూడ-నుండును.

లీలావతి సింహళరాజ పుత్రిక. ఆమెను ప్రేమించి పెండ్లియాడినది మొదలు హాలమహారాజులో సాహిత్యప్రీతి చిగిర్చి కుసుమించి పరిమళింపసాగెను. ఆదంపతు లిరువురు కవిత్వపు సొగసులు ముచ్చటించుకొనునపుడు వినువారికిఁ గడు ముచ్చటగా నుండును. రాజకీయ తంత్రములమీఁద నున్న శ్రద్ధకంటెఁ గవిత్వగోష్ఠిపై వారి కెక్కుడు మక్కువ.

నాఁడు హాలభూపాలుని పార్శ్వమున భారతీదేవివోలెఁ గూరుచుండిన లీలావతితో సభామండపము మహోజ్జ్వలలీలా మండితమై యొప్పుచుండెను.

మహారాజ్ఞి పెదవి కదలుననఁగా, సభ్యలోకమున వింధ్య మాఁకిడినట్లు నిశ్శబ్దత యేర్పడెను. లీలావతినోరు కదలి నచో మంచిముత్తెములు జలజలరాలును. ఆమె తఱచు మాటలు వెచ్చపెట్టదు. మందహాసభాసుర కటాక్షాంచల ముతో నొక్కసారి పట్టపుదేవి మహాప్రభువువంకఁ బరికించెను. ఆమె చిఱునవ్వులో నెంతో యర్థము దాఁగియున్నది. శాలి వాహన భూజాని పరేంగితజ్ఞుఁడుగావున నా యర్థము లెస్సగాఁ దెలిసికొనఁ గలిగెను. "మన సాహిత్యచర్చ యింక నారం భింతము ... మీ ప్రాకృతభాషకంటె మా సంస్కృత సార స్వతము రసోదంచితమైనది సుఁడీ!" అని రాణి తన్నధిక్షే

పించుచున్నట్లు శాలివాహనుఁడు భావించెను. ఆ యాక్షేప
ణము మహారాజునకుఁ దేనెలో ముంచిన మిర్యపుతుండవలెఁ
దియ్యగాఁ జుఱుకుగా నుండెను.

రాణి యందుకొనెను: "శ్రీ వారి ప్రాకృత భాష
లోని 'గాథలు' మా సంస్కృత సాహిత్యములోని శ్లోకము
లతో నెన్నఁటికి సాటిగావు. కోపమురానిచో నొక్కమాట
మనవిచేసెదను. ఏ భాష వేదపురాణ శాస్త్రములకు జన్మ
భూమియో, ఏవాణి దేవతల ముఖపద్మములను బవిత్రము
గావించెనో, ఏ సరస్వతి వ్యాసవాల్మీకి ప్రభృతి ఋషిప్రవరుల
మహోత్తమ రచనలతో నిత్యనవ్య శోభావంతమై యలరారు
చున్నదో, యట్టి గీర్వాణసాహితి సర్వజన సేవ్యమైనయ
ప్రాకృతమైనను, మఱియొకటియైనను సంస్కృత సరస్వతి
తరువాతఁ బ్రశంసింపఁ దగినవే. మహారాజుల సన్నిధిని వలసి
నచో వేలకొలఁది యుదాహరణములు చూపించుటకు సంసిద్ధ
రాలను."

'రాణిగారు చెప్పినవి సత్యోక్తులు" అన్నట్లు
... జూచెను. శర్వవర్మ చూచిన చూపులో
... రము, నొక యాత్మవిశ్వాసము గుర్తించి
గుణాఢ్యుఁ డిట్లు వచించెను:

మా ప్రభువులకు సంస్కృత భాషోన్నతి తెలియక
పోదు. కాని మధుర మధురములైన పదములు, హృదయ

తంతులనుబట్టి యూఁపఁగల భావములు కానలయునన్నచోఁ ప్రాకృతభాషకుఁ బ్రాకృతభాషయే సాటి. ఆ భాషలోని యొక్కొక్క 'గాథ' యొక్కొక్క సంస్కృత కావ్యమునకుఁ బోటివచ్చును. బండ్లకొలఁది సారస్వత ముండుటయే భాషకు ఘనతకాదు. సాహిత్యములోని జీవమునుబట్టి దాని విశిష్టత వెల్లడియగుచుండును. ఈ సంగతి శ్రీ రాణిగారికిఁ దెలియదని కాదు. ఇంతకును, వారి గీర్వాణ భాషాభిమాన మద్వితీయ మైనది."

గుణాఢ్యమంత్రి మాటలకు హాలరాజు బుజములు పొంగెను. "సెబాసు! నా యభిప్రాయమునే యచ్ఛముగా గుణాఢ్య పండితులు వెల్లడించినారు. లీలావతికిఁ బ్రాకృత సరస్వతీ మధురిమ తెలియదుపాపము!" అని యాతఁడు వెడ నవ్వు నవ్వెను.

లీలావతి ముఖాంబుజము జేవుఱించెను. శర్వవర్మ గుణాఢ్యునివైపు చుఱచుఱ చూచుచు నేదో పలుకఁబోవు చుండఁగా, రాణి యందుకొని యిట్లు పలికెను:

"ప్రభువులు చెప్పినది సత్యము. నేను ప్రాకృతస్త్రీని గాను. నాకుఁ బ్రాకృత మాధుర్యములు తెలియవు. పోనిండు. ఒక శబ్దము నెట్లు విడఁదీయవలయునో యేలినవా రెఱుఁగరు పాపము! భాషా పరిజ్ఞానమే లేనిచో రసవిచార మెక్కడిది?"

రాణి యెత్తిపొడుపుమాట హాలరాజు గుండెలో సూది గ్రుచ్చినట్లు పొడుచుకొనెను. అప్పటి హాలనేత ముఖవైఖరి పరికించి రాణి తొందరపాటునకు శర్వవర్మ నివ్వెరపడి పరిష్కారదృష్టితో నీవిధముగా మాటాడెను:—

"ఇంతకును నొక్కొక పువ్వున కొక్కొక్కతీరు పరిమళము. మాలతీపుష్పములోని సౌరభము విరజాజి కుండదు. విరజాజిలోని తావి సంపెంగకు రాదు. సంపెంగలోని సౌరభము మఱియొక కుసుమమున కుండదు. దేని విశిష్టత దానిది. సంస్కృత భాషాదృష్టిలోఁ బ్రాకృతము నిస్సారమైనచోఁ బ్రాకృతవాణి దృష్టిలో సంస్కృతము తృణప్రాయమగును. ఈ వివాదములు తేలునవి కావు.

అంతతో నాఁటి సాహిత్యచర్చకు స్వస్తి.

---

3

హాల మహారాజు కోటలోని చంద్రకాంత శిలాసౌధమున నేకాంతమునఁ గూర్చుండెను. అతని ముఖము, మంచు ముసుఁగుతోనున్న పంకజమువలె నుండెను. సువిశాల సుందరమైన యతని నొసటిపై నొక విషాదనీలరేఖ చూచువారికి సుస్పష్టముగా గోచరించుచుండెను. హాలరాజు కొలఁదినాళ్ల

క్రితము జరిగిన యొక విచిత్రసంఘటనమును దలఁపునకుఁ దెచ్చుకొనుచున్నట్లు మనము భావింపఁగలము.

"ఒకనాఁడు లీలావతియు హాలరాజు క్రీడోద్యానమునఁ బద్మసరస్సులో జలక్రీడ లాడుచుండిరి. లీలావతి యొక తామర పూవు నూడఁబెఱికి యాటవేడుకతోఁ బ్రాణనాథుని చెక్కిలి నొవ్వ నేసెను. రసిక చక్రవర్తియగు హాలుఁడు దిగ్గున రెండు తామరమొగ్గ లందుకొని లీలావతి రెంటుబుగ్గలు నెఱ్ఱవాఱు నట్లు గొట్టెను. లీలావతియుఁ దన చిగురువ్రేళ్ళతో నీళ్ళుతీసి జల్లుజల్లుగాఁ బ్రియునిపైఁ జల్లుచుండెను. హాలుఁడు తన మగతనమును బ్రదర్శించుటకో యన రాణి యుక్కిరి బిక్కిరి యగునట్లు ముఖముపై నదేపనిగ జలము గొట్టు చుండెను. సలిలసమ్మర్దమునకు లీలావతి తాళలేక పోయినది. ఆమె కూపిరి యాడలేదు. తోడనే సంస్కృతభాషలో నామె భర్త నుద్దేశించి "మామోదకైస్తాడయ" యని ప్రార్థించెను. హాలుఁ డామె వేఁడుకోలు విన్నాఁడు. వెంటనే చల్లులాట చాలించి యట్టహాసముచేసి "ఓహో! రాణిగారికి మోదకము లతోఁ దాడనము కావలయునుగాఁబోలు" ననెను.

ఆ మాటకు లీలావతి పక్కున నవ్వఁగా, రాయంచ ఱెక్కలు జాడించినట్లుండెను.

"మహారాజులుంగారు నాభాష నీరీతిగా నర్థముచేసి కొన్నారు. నేను గోరినది, మోదకములతోఁ గొట్టుఁడని

కాదు. ఉదకములతోఁ గొట్టవలదని ప్రార్థించితిని. "మా-
ఉదకైః" అను రెండు పదములు కలిపినచో "మోదకైః" అ
యగును. ప్రభువులకు సంస్కృత భాషా పరిచయము తక్కు
యనుటకు నాకు సాహసములేదు" అని రాణి యెత్తిపొడుప
మాట వాఁడిగా విసరెను".

ఇది కొంతకాలము వెనుక జరిగిన వింత సంఘటనము
ఈ సన్నివేశము తలంచుకొన్నప్పుడు హాలరాజు మనస్సునకు
గుదురుపాటుండదు. గోరుచుట్టుపై రోఁకటి పోటువలె లీలావతి
నిండోలగమున నన్నమాట యతనికి మఱియు వ్యథాకర
మయ్యెను. హాలుఁడు తనలోఁ దానిట్లు భావించుకొనెను.

"లీలావతిచే నిండుసభలో నటు లనిపించుకొంటిని.
గుణాఢ్య శర్వవర్మ లుండఁగాఁగూడ సంస్కృతశబ్దము విడ
దీయుట నాకుఁదెలియదని యామె యధిక్షేపించెను. శర్వవర్మ
రాణిపక్షము వాఁ డయ్యెను నన్ను సమర్థించుచు మాటాడి
నాఁడు. నిజమే...ఆలోచింపఁగా నాకుఁ బ్రాకృతవాణిపై
మమకార ముండవచ్చును. ఈ యొక్క భాషలోనే ప్రపంచ
మంతయు నున్నదని మురిసి ముచ్చటపడుటకంటె నితర భాషలు
కూడఁ బఠించి వానిలోని సొగసులు గుర్తించుటలోఁ దప్పేమి?
ప్రాకృతమున నెట్టి వైదుష్యమును సంగ్రహించితినో సంస్కృత
మునఁగూడ నట్టి పాండిత్యమును సంపాదింపవలయును. లీలా
వతి భాషాగర్వమును బరిహరింపవలయును. శర్వవర్మాదులకు

సంతోషము నొదవింపవలయును. ఆంధ్రదేశమున సంస్కృత సారస్వతచంద్రికలు గాయింపవలయును. నాఁటిదాఁక నిద్ర పోరాదు."

ఇట్టి భావనలో నేకాంతముననున్న హాలపతిని దర్శించుటకు గుణాఢ్యమంత్రి విచ్చేసెను. గుణాఢ్యునకు మహారాజునకు నొకటే ప్రాణము. హాలుఁడెట్టి యేకాంతమున నున్నను వచ్చి మాటాడుట కొక్క గుణాఢ్యునకే చనవుకలదు. శర్వవర్మకు హాలపతితోనున్న చనవు వేఱు. గుణాఢ్యున కున్నట్టి చనవు వేఱు.

శర్వవర్మ లీలావతితో సరణముగా వచ్చిన పండితకవి. అతఁడు రాణిగారిమాటతో హాలసంస్థానమునఁ బ్రధానమంత్రి యయ్యెను. గుణాఢ్యుఁడు హాలునకు చిన్ననాఁటినుండిమిత్రుఁడు. ఆకారణమున గుణాఢ్యుఁడును మంత్రిపదవి నందెను. పండితులు సచివోత్తములై రాజ్యతంత్రములు నడపుచుండుట భారతదేశమునఁ గ్రొత్తకాదు. గుణాఢ్య శర్వవర్మల కిరువురకు లోలో వైరబీజములు కలవు. అవి సాహిత్యచర్చాసందర్భములలో మొలకెత్తుచుండును. మొత్తముమీఁద, రాణియు శర్వవర్మయు సంస్కృతభాషాపక్షము. హాల గుణాఢ్యులు ప్రాకృతభాషాపక్షము. తఱచు గుణాఢ్యుఁడు మహారాజును దర్శించి గంటలకొలఁది సంభాషణము నెఱపుచునే యుండును.

ఆలోచనామగ్నుఁడైన హాలునకు గుణాఢ్యమంత్రిని చూడఁగనే ప్రాణములు లేచివచ్చెను. అభివాదములు, ప్రత్యభివాదములు నైనవెనుక మంత్రి యిట్లు ముచ్చటింపఁదొడఁగెను.

"మహారాజా! తమరు కూర్చిన 'గాథాసప్తశతి' కావ్యములోని 'గాథలు' మననము చేసికొనుచున్నకొలఁది చవులూరుచున్నవి. ఏమి సొగసైనభావములు! ఏమి సుందరమైన పదసంధానము! జానపద పరిస్థితులు కన్నులకుఁ గట్టినటులు చిత్రింపఁబడినవి. ఒకగాథ ప్రబంధశతమునకు దీటు వచ్చునది. ఈకావ్య మొకఁడే తమకీర్తిని బరమశాశ్వతము చేయఁగలదు. ప్రభువులతోపాటు కవయిత్రిమణులును గవులును బెక్కుమంది చిరకీర్తి నందుకొనఁగలరు."

గుణాఢ్యమంత్రి మాటలు సాతవాహనుఁడు మనస్సునకుఁ బట్టించుకొనలేకపోయెను. భూవరుఁడు పరధ్యానములో నుండెనని మంత్రి కనిపట్టెను. ఒక్కింత తడవు నిశ్శబ్దత. హాలభూపతి సచివసత్తముని జూచి "మీవలె నుభయభాషలు సాధించినవా రేమన్నను జెల్లిపోవును. మాకు సంస్కృత సారస్వతములో నున్న పరిచయ మల్పాల్పము. అట్టి పరిచయముతో నా వాఙ్మయము నిస్సార మనుకొనుటయుఁ, బ్రాకృతమే యుత్తమోత్తమవాఙ్మయ మనుకొనుటయు నన్యాయము కదా! భాషను గూలంకషముగా సాధించినపిమ్మట దాని యెక్కువ తక్కువలు వక్కాణించుట కధికారము కలుగును.

అచిర కాలములో గీర్వాణ సాహిత్యమున నైపుణ్యమును మేము సంపాదించి తీరవలయు" నని పలికెను.

ఏలికపలుకులకు గుణాఢ్యుఁడు చాల నివ్వెఱపడెను. ఇంతలో నచింతితముగా నిట్టిభావమును వెల్లడించిన మహారాజున కేమి బదులుచెప్పవలయునో యతనికిఁ దోఁచలేదు. హాలుఁడు సంస్కృతభాషావిశారదుఁ డగుట గుణాఢ్యునకుఁ గిట్టదా? – అదికాదు; ప్రాకృతభాష కవలంబము సన్నగిల్లును. ప్రాకృతభాషాభిమానులగు తమవంటివారి కాశ్రయము వెనుకఁబడును. మహారాజు గీర్వాణభాషాప్రియుఁడైనచో వచ్చెడి యిబ్బంది యిది.

గుణాఢ్యుని యెదుట హాలుఁ డింతదాఁక నెన్నఁడునిట్టి యన్యభాషాభిమానము ప్రకటించుమాట మాటాడలేదు. "ప్రాకృతవాణికిఁ బతనదశ కాఁబోలు!" నని గుణాఢ్యుఁడు లోన భావించి యూరకుండి "ప్రభువులచిత్త" మని పలికి సెలవుదీసికొని వెడలిపోయెను.

---

౪

పట్టపురాణి లీలావతికి రేయి నిద్దురపట్టలేదు. ఆమె యెన్నఁడును భర్త కెదురాడి యెఱుఁగదు. వాఙ్మయవిషయకముగాఁ బ్రియునితో భిన్నాభిప్రాయము వచ్చినను మృదు

పాకముగా బదులు చెప్పుటయేకాని ముదురుధోరణిలో మాటాడి యెఱుఁగదు. ఆమె సింహాళేశ్వరుని ప్రియపుత్రిక. తండ్రి యామెను గారాబముగాఁ జూచుకొని యొక విద్వాంసుని గురుత్వముతో సంస్కృతభాష నభ్యసింపఁజేసెను. తద్భాషారహస్యము లామెకుఁ దెలియనివి లేవు. సుశిక్షితమైన పాండిత్యమును వెల్లడించుచు నామె సంభాషించునపుడు షట్ఛాస్త్రములం దందెవేసిన కోవిదులకు గుండెదడగా నుండును.

సహజముగా నామెది కోకిలగళము. పంచమస్వరములో నేదేని శ్లోకము పఠించి యామె దానిలోని విశేషార్థమును వ్యక్తము చేయునపుడు శ్రోతలు ముగ్ధులగుచుందురు. హాలుని సారస్వతప్రీతి, గుణప్రశస్తి, ప్రాకృతభాషావైదుష్యము గుర్తించి యామె యాతనిని వలచినది. హాలనేతయు లీలావతి సాహిత్యపరతకు మురిసియే ప్రేమించి పెండ్లియాడెను. సప్త గోదావర తీరమున నున్న భీమేశ్వరక్షేత్రమున లీలావతీ హాల నేతలకు వివాహము జరిగిన దని కావ్యప్రసిద్ధమైన విషయము.

ఒకరి నొకరు సాహిత్యబాంధవముతోఁ బ్రేమించుకొన్న యీ వాల్లభ్యము పౌరపొచ్చెములు నరమరలు లేక యింతదాఁకఁ జక్కఁగా సాగుచున్నది. ఇప్పుడు తన మాట తొందరవలన హాలుని హృదయమున కేమేని నొవ్వు కలుగునేమో యని లీలావతికి దిగులుగా నున్నది.

జలక్రీడాసందర్భమునఁ దా నన్నమాటను సభలో నామె మరల నుటంకించినది. అది ప్రియుని మనస్సున నాటు కొన్నటులుకూడ నామె గుర్తించినది. మృదుహృదయ యగు లీలావతి కిఁకఁ గుదు రెట్లుండును ?

లీలావతి వెనువెంటనే శర్వవర్మకు వర్తమాన మంపెను. ఆ మంత్రిశేఖరునికడఁ దన చింత వెల్లడించుకొన్నచో హృద యము కొంత బరువు తగ్గు నని యామె యభిప్రాయము. శర్వవర్మ తన్నుఁ దండ్రివలె జూచుచున్నాఁడు. అరణముగా వచ్చిన కవి యైనను నేఁడు శర్వవర్మ హాలరాజు తలలోనాలుక. శర్వవర్మ 'యిది యిట్లుచేయవలయు' నన్నచో హాలరాజు జవదాఁటఁడు.

మహామంత్రి లీలావతీ దర్శనార్థము విచ్చేసెను. యథో చితములైన మర్యాద లయిన పదపడి శర్వవర్మ "అమ్మా! నిన్నటి కొలువులోఁ దాము కొంచెము తొందరపడితి రేమో యనిపించినది. మహారాజుగారు ప్రాకృతభాషలో సాటిలేని విద్వాంసులు. వారినిగూర్చి వాఁడిగా మాటాడుట నాకు భయము" అని పలికెను.

లీలావతి యేవిషయము శర్వవర్మతో ముచ్చటింపఁ దలఁచుకొనెనో యావిషయ మతఁడే ముందుగా నందుకొనెను. రాణి కది మఱియుఁ జిన్నతనముగా నున్నది.

"మహామంత్రీ! అదే నాకును భయముగా నున్నది. మహారాజుల నేవిధముగానేని సంస్కృతభాషాప్రియులనుగాఁ జేయవలయును. ఈయుద్దేశముతో నే నపుడపుడు మార్దవము విడిచి పరిహాసములు పలుకుట జరుగుచున్నది. కాని, నిన్నటి సాహిత్యగోష్ఠిలోని నామాట ప్రభువును గొంత కష్టపెట్టి యుండును. నా "క్షమాపణము" వారితోఁ దాము చెప్పవల యును. అభిజ్ఞవరులగు తమకుఁ బెక్కు వివరింపనక్కఱ లేదు గదా!"

పట్టపురాణి యీపలుకులు విని శర్వవర్మ యెంతో నొచ్చుకొనెను. ఆమె పడుచున్న బాధ నర్థముచేసికొనెను. "దయార్ద్రహృదయుఁడగు హాలరాజు మీవిషయమున నన్యథా భావించువాఁడుకాఁడు. మతేమియు దిగులు పడకుఁడు. నేను వెళ్ళి ప్రభువులను దర్శించెదను...ఇదియు మేలునకే వచ్చిన దని సరదిచెప్పి మహామంత్రి నిష్క్రమించెను.

౫

మరునాఁడు ధాన్యకటకమునఁ గొలువులో హాల భూపాలుఁడు పసిఁడిగద్దె నలంకరించియుండెను. యథాపూర్వము శర్వవర్మయు గుణాఢ్యుఁడు వారివారిపీఠములయందాసీనులై యుండిరి. మహారాజ్ఞి లీలావతియు సభ కొక

లలిత శోభను దెచ్చుచు హాలప్రభువు ప్రక్క నుపవిష్టుఁడై యుండెను.

మాధవి, రేవ, అనుపలబ్ధ, అణులక్ష్మి మున్నగు కవయిత్రీరత్నములు సభాభరణములుగాఁ దీర్చియుండిరి. సంస్కృత ప్రాకృత దేశభాషావిద్వత్కవు లెందఱో సంస్థాన పరిషత్సభకు మండనాయమానముగాఁ గూరుచుండియుండిరి. పండితకవినిబిడమై కొలువు నీరవముగా విరాజిల్లుచుండెను.

ఆసమయమున నభ్రవృష్టివలె హాలమహారాజు సభ్యలోకమును బరికించి యిట్లు పలికెను :

"మంత్రివరులారా! పండితశేఖరులారా! నిత్యసాహిత్య గోష్ఠుల ఫలముగా మాకొక క్రొత్త తలంపు కలిగినది. అది మీయెదుట వెల్లడించెదము.

ప్రపంచములోని ప్రతిభాషకు నొక ప్రత్యేకత, యొక విశిష్టత యుండవచ్చును. ఏభాషయైనను బఠించినతరువాతఁ గాని దానిలోని భావోన్నతి మనకు గోచరింపదుగదా! భాషావివాదములవలనఁ బ్రయోజనము లేదు. మాకుఁ బ్రాకృతభాషలో నున్నంత గాఢప్రవేశము గీర్వాణసాహిత్యములో లేదు. నేఁడు సంస్కృతవాణిని సాధించితీరవలె నని యభినివేశము పొడముచున్నది. వ్యాకరణశాస్త్రబలము లేని వట్టి వాఙ్మయ పరిచయము గాలిమేడ వంటిది.

కావున సరహస్యముగా వ్యాకరణ సర్వస్వము మాకు శీఘ్రకాలములో బోధింపవలయును. మీ పండితవర్గములో దీనికిఁ దగినవా రెవరో వచింపుఁడు".

హాలప్రభుని యీ యపూర్వాభిలాషమునకు సభలోని గీర్వాణభాషాపండితుల మనఃపద్మములు వికసించినట్లయ్యెను. ప్రాకృతభాషాకోవిదుల కబ్బురపాటు భంగపాటు వాటిల్లినటు లయ్యెను. రాణి లీలావతి తలంపని తలఁపుగాఁ బ్రియునకుఁ గలిగిన యపూర్వ మధురాశయమునకు మురిసిపోయెను. మబ్బులేని మెఱుపుగదా! లీలావతి శర్వవర్మవంక సాశ్చర్యముగాఁ బరికించెను. శర్వవర్మ వినమ్ర దరహాస భాసురముఖముతో మహారాజ్ఞిని విలోకించెను. గుణాఢ్యునకు మనసు క్రుంగినటులుండెను. సభ కొలఁదినిమిషములు మౌనముద్రితము.

సాహసించి గుణాఢ్యుఁడు లేచి —

"ప్రభూ! శాస్త్రాభ్యాసము సాధారణమైనది కాదు. వ్యాకరణముకాదు, తర్కముకాదు, మీమాంసకాదు. ఏ శాస్త్రము నధ్యయనింపవలె నన్నను నిండుగాఁ బండ్రెండేండ్లు పట్టును. అందులో, శబ్ద శాస్త్రాధ్యయనము మఱియుఁ గష్టతరమైనది. అయినను, ప్రభువులు మేధానిధులు కాఁబట్టి యాఱు సంవత్సరములలో శబ్దశాస్త్రము నే నుపదేశింపఁగలను" అని వచించెను.

"ఆఱు సంవత్సరము" లన్నంతనే హాలరాజు గుండె లరచేత నొక్కుకొనెను. "అంతవఱకు నట్లే పఠించుచుండవల సిన దే! శీఘ్రముగా సాధించుటకు వీలు కలుగదా!" యనెను. గుణాఢ్యుఁడు తలయడ్డపుట్టూఁపుతో 'నాకు సాధ్యముకాదు. తరువాతఁ బ్రభువుల చిత్తము' అని యూరకుండెను.

శర్వవర్మ గంభీరత కొంత సడలించుకొని యానందో త్సాహములు దాఁచుకొన యత్నించుచు హాలప్రభునిఁ గని యిట్లు పలికెను :

"మహారాజా! గుణాఢ్యమంత్రి మనవిచేసినట్లు శాస్త్ర పాఠమునకుఁ బండ్రెండేండ్లు పట్టుట లోకసామాన్యమైన విష యము. కాని, కుశాగ్రబుద్ధిసంపన్నులగు ప్రభువుల కట్లుగాక యాఱుమాసములలో సర్వశాస్త్రము బోధింపఁగలను. సంస్కృత భాషాభిలాష ప్రకటించుటయే మాకుఁ బదివేలు."

శర్వవర్మ మాటలు విని గుణాఢ్యుఁడు కోపాసూయలను బట్టలేకపోయెను. మంత్రుల కిరువురకు వాదము రేఁగెను.

గుణాఢ్యుఁడు:— "ఓయీ శర్వవర్మా! వేగిరపడుచున్నావు. మహారాజుగారెంత మతిమంతులైనను, నీవెంత బోధన శక్తికలవాఁడవైనను శబ్దశాస్త్ర మాఱుమాసములలో నధ్యయనించుట సాధ్యముకాని కార్యము. ఇది గర్వో క్తిగాఁ గనిపించుచున్నది. ఆఱు సంవత్సరములలోఁ జెప్పుటయే యసాధ్య మని నేను భయపడుచుండఁగా,

ఆఱుమాసములలో బోధించుటయే !! నిండుసభలో నిట్లు ప్రతారించి ప్రతిజ్ఞసేయుట యుచితము కాదు.

శర్వవర్మ:— ప్రతారణము కాదు. ఆఱు మాసములలో శబ్దశాస్త్రము చెప్పఁగల నని మరలఁ జెప్పుచున్నాను.

గుణాఢ్యుఁడు:— చెప్పవచ్చును. మహారాజులకు దెలియుట యసాధ్యమేమో!

శర్వవర్మ:— తెలియునట్లు బోధింపఁగలను.

గుణాఢ్యుఁడు:— ప్రభువు లన్యథా భావింపకుందురుగాక!... శర్వవర్మా! పుడమి తలక్రిందులైనను నీకీపని సాధ్యము కాదు.

శర్వవర్మ:— సాధ్యపడినచో, నేమందువు?

గుణాఢ్యుఁడు:— పెక్కేల, మహారాజా! శర్వవర్మా! సభాస్తారులారా! నాప్రతిన వినుఁడు. ఈ పెద్దమానిసి యాఱు నెలలలో 'శాబ్దము' బోధించి యభ్యర్థిని పండితునిగా దిద్దఁగలిగిననాఁడు సంస్కృత-ప్రాకృత-దేశభాషలు మూఁడును బరిత్యజించి మానినై కాంతారమున నివసింతును.

శర్వవర్మ:— గుణాఢ్యా! ఈప్రతిజ్ఞ తప్పరాదుసుమీ!

గుణాఢ్యుఁడు:— దైవసాక్షిగా.

శర్వవర్మ:— మఱి నాప్రతిజ్ఞ వినుఁడు. ఆఱుమాసములలో మహారాజును శబ్దశాస్త్రపారంగతునిఁ జేయలేనినాఁడు

గుణాఢ్యమంత్రి చేసిన ప్రతినయే నేనును జేయు చున్నాఁడను.

గుణాఢ్య శర్వవర్మల ప్రతిజ్ఞా వాక్యములు సభామండ పమునఁ బ్రతిధ్వనించెను. హాలభూపతి యేది యెట్లైనఁ, తన కోరిక నెఱవేఱు నని సంతోషపడెను. భావి పరిణామముఁ దలపోసి సభ్యులు సంభ్రమాశ్చర్యములతో నిండ్లకేఁగిరి. లీలావతికి గుణాఢ్య శర్వవర్మల వివాదము శ్రవణానందకర మయ్యెను.

---

## ౬

శర్వవర్మ నిండుకొలువులోఁ జేసిన ప్రతిజ్ఞ సామాన్య మైనదికాదు. ఆఱు సంవత్సరములలో సాధ్యముగాని పని యాఱు మాసములలో నిర్వహింపఁబూనుట సాహసకార్యము కాకపోదు. దూరదర్శియగు మహామంత్రి యింతతొందరపడు నని యెవ్వరును భావింపలేదు. శర్వవర్మ పట్టుదల నెఱిఁగినవా రెవ్వరు నాతనిది తొందర యని యూహింపరు. రాజ్యతంత్ర ములలో నాతఁడు పెక్కుసారులు దారుణప్రతిజ్ఞలు చేసి కృత కృత్యుఁడగుచుండుట చాలమంది యెఱిఁగినదే. మఱి, ఇది సాహిత్యవిషయకమైన ప్రతిజ్ఞ! ఎట్లు పరిణమించునో!!

శర్వవర్మ కుమారస్వామి భక్తుఁడు. కుమారోపాసనమున నిరంతర నిష్ఠా పరతంత్రుఁడై రేలుంబవళ్లు పూజించుచుండుట కలవాటు పడినవాఁడు. మానసికముగా నతనికే దేని యస్వస్థత కలిగినపుడు శక్తిధరోపాసనము చేసి దానిని బరిహరించుకొనుచుండును. రాజకీయముగఁ గ్లిష్టసమస్యలలోఁ దగులుకొన్నపుడు తత్పరిష్కారమార్గముగ షణ్ముఖారాధనము చేయుచుండును.

శర్వవర్మ కది పరీక్షాసమయము. ఏకదీక్షతోఁ గార్యసాధనమునకై కుమారారాధనము నుపక్రమించెను. సుబోధము, సులభగమ్యము, సుందరము నగు శబ్దశాస్త్ర మతనికిఁ గావలయును. ఆశాస్త్రము హాలభూపతికి బోధించి యతనిని వైయాకరణుని జేయవలయును. ఇదియే శర్వవర్మ యభీష్టము.

సరిగా నొక నెలనాళ్ళు మహామంత్రి షణ్ముఖోపాసనములో దీక్షితుఁ డయ్యెను. కుమారస్వామి కరుణాకటాక్షముచే శర్వవర్మకు సులభసుందరమగు శబ్దశాస్త్రము స్ఫురించి రచింపఁ గలిగెను. రెండవ మాసమునుండి శాలివాహనభూపాలునకు శాస్త్రపాఠ మారంభమయ్యెను.

శాలివాహనుఁడు ప్రాకృతభాష నవలోడించిన కోవిదోత్తముఁడు. ఒక భాషనుగాని, ఒకశాస్త్రమునుగాని సాధించిన విద్వాంసునకు వేఱొకభాష వేఱొకశాస్త్రము మిక్కిలి సులువుగా వచ్చును. మహారాజేకసంథాగ్రాహి. శర్వవర్మ

మహాపండితుఁడు, శాస్త్రోపదేష్ట. ప్రభు మంత్రులిరువురు గురు శిష్యులగుట చూచువారికి వేడుకగా నుండెను. ఆ శైష్యోపాధ్యాయిక నరసి లీలావతి హృదయ మానందవీచికలలో దోఁగాడుచుండెను.

బ్రాహ్మముహూర్తమున హాలరాజు మేలుకాంచును. స్నానసంధ్యాదులైనవెంట వ్యాకరణశాస్త్రపాఠము. ఉదయము పఠించినపాఠము మధ్యాహ్న మొకసారి చింతనము చేసికొనును. దానితో మఱి మఱచిపోవుట యుండదు.

శర్వవర్మ గురుపీఠమున నుపవిష్టుఁడై బోధనము చేయు నపుడు హాలుఁడు వినమ్రుఁడై యాలించుట చూడఁగా "ఆహా! మహారాజభావ మేమైపోయిన" దనిపించును. తనకుఁదెలియని విషయము వినయముగా గురువు నడిగి శిష్యుఁడు తెలిసికొనును. గురువు శిష్యుని ముఖవైఖరి నరసి యరఁటిపం డొలిచి చేతఁబెట్టినట్లుగా గూఢవిషయములు బోధించును.

'విశాలమైన సామ్రాజ్యభారము వహించుచున్న హాల నరపతి యైదుమాసములు తాత్పర్యముతో శాస్త్రాధ్యయనము చేయుట యేమి!' యని యాశ్చర్యపడినవారి నోళ్ళు కట్టువడి నవి. సామ్రాజ్యము చక్కదిద్దుకొనుచు, శత్రువుల దండ యాత్రలను బ్రతిఘటించుచు, దర్శింపవచ్చిన పండిత వర్గమును సత్కరించుచు, రాజకీయముగాఁ బొటమిల్లిన క్లిష్టసమస్యలను బరిష్కరించుచు హాలనేత హేలగా శాస్త్ర మధ్యయనించి

లంకషమైన పాండిత్యము నముపార్జించెను. అభినివేశముతో నఖిలము సాధ్యపడునుగదా!

సంస్కృతవాఙ్మయములో శబ్దశాస్త్రములో నేఁడు శాలివాహన భూజానికిఁ దెలియని రహస్యమొక్కటియు లేదు. సర్వము కొట్టినపిండిగా నుండెను. కొమ్ములుతిరిగిన కోవిదుఁడు దర్శనమునకు వచ్చినను నాతని నేదో ప్రశ్నించి శృంగభంగము చేయుచుండెను. గుణాఢ్యునితోఁ బ్రాకృతగోష్ఠి నెఱపు నా నరపతి శర్వవర్మతో సంస్కృతకవితా చర్చలతోఁ బ్రొద్దు పుచ్చుచుండెను.

పట్టపురాణి లీలావతి జీవితములో వసంతోదయమై నూతనపరికరణ మారంభమయ్యెను. ఆమె యాశ్చర్యబంధుర మైన యానందములో మునకలు వేసెను. వృద్ధుఁడైన చ్యవనుఁడు నవయౌవన శోభితుఁడైననాఁడు 'సుకన్య' పడిన సంతోషాతిశయము లీలావతి కపు డనుభూత మయ్యెను. శర్వవర్మయు, రాణియు, మహారాజు, నిరంతర సంస్కృత సాహిత్యచర్చలలో నిమగ్నులై యుండిరి.

హాలరాజు దేవభాషలో విద్వాంసుఁడైనపిమ్మట జరిగిన పరిషత్సభామండపము సుధర్మవలె భాసిల్లెను. హాలప్రభువు వదనపద్మమున నూతనరాగము విరాజిల్లుచుండెను. ఇన్నాళ్ళు లీలావతి లలితమంగళోజ్జ్వలమైన తేజోరేఖముందు హాలుని తేజోరేఖ కొంచెము సన్నవడియున్నట్లు తోఁచెడిది. ఇపు

డటులుకాదు. హాలుఁడు నేఁడు సంస్కృత ప్రాకృతములలోఁ
బుంభావ భారతి.

తొల్లిటివలెనే నేఁడును శర్వవర్మయు గుణాఢ్యుఁడును
నర్ధాసనాసీనులై యుండిరి. మహామంత్రి ముఖము విచ్చిన
శతపత్రమువలె నతిమనోహరముగా నుండెను. గుణాఢ్యుని
మొగమున నెత్తురుబొట్టు లేదు.

నిశ్శబ్దమైన కొల్వుకూటమున గుసగుసలు బయలుదేఱి
నవి. బహుకాలమునుండి ప్రభువునకుఁ బ్రాణప్రాణముగా
మెలఁగిన గుణాఢ్యమంత్రి యరణ్యవాసమునకుఁ బాలుపడవల
యును గాఁబోలు!

శర్వవర్మ లేచి యుపక్రమించెను. "ఏలినవారు గీర్వాణ
భాషావైదుష్యమున నద్వితీయులైనారు. వలసినచో నిచట
నున్నవారిలో నెవరేని వారితో వాక్యార్థములు జరుపవచ్చును.
నాఁడు నేను చేసిన ప్రతిజ్ఞ దైవానుగ్రహమున సఫలమైనది.
ఆఱుమాసములలో శబ్దశాస్త్రము బోధించుటయు గ్రహించు
టయు నసాధ్య మనికదా గుణాఢ్యమంత్రి చెప్పెను ! ఇప్పుడు
వారేమందురో!"

గుణాఢ్యుఁడు పరమగంభీరుఁడు. ఆతఁడు శర్వవర్మను
గన్నెత్తి చూడలేదు. సభ్యులను దిలకింపలేదు. హాలునిం గని
"ప్రభూ! దీక్షకు సాధ్యముకాని శాస్త్రములేదు. నా ప్రతిజ్ఞ
ప్రకారము నేఁటినుండి సంస్కృత ప్రాకృత దేశభాషలను నన్య

సించి వానపర్థిమును నెఱపుకొందును. సెలవా సంగు" డని యవనతవదనుఁడై మానియై కొలువునుండి నిష్క్రమించెను.

సాతవాహనమహీపతి గుణాఢ్యునితోడి చిర సంబంధము విడిపోవుచుండుటచే విషణ్ణచిత్తుఁ డయ్యెను. శర్వవర్మయు నొక్కక్షణము గళస్తంభితాశ్రుఁడై నిలఁబడిపోయెను. కొలువు వేడినిట్టూర్పులతో నుడికిపోయెను. కొలువులో గుణాఢ్య మంత్రి కూరుచుండు పసిఁడిగద్దె కళాహీన మయ్యెను.

తెలుఁగు రాజధానియగు ధాన్యకటకములోఁ గ్రొత్త శక మారంభమయ్యెను. ఇదివఱ కెక్కడఁ జూచినను బ్రాకృత భాషా పండితులే; ఎక్కడ విన్నను బ్రాకృతకవితా ప్రసంగములే. ఇప్పుడు దేవభారతి ధాన్యకటకములో సర్తనము సేయుచున్నది. ప్రభువునుబట్టి లోకము మాఱును. వాఙ్మయము మాఱును. కళలు మాఱును. మతము మాఱును. సకలప్రవృత్తియు మాఱును.

రాజధానిలోఁ బ్రాకృతమున కుద్వాసనము. సంస్కృత భాష కావాహనము. ఈసంధికాలములోఁ గొందఱు వాఙ్మయ ఘర్షణములతోఁ గుమ్ములాడుకొనిరి. బౌద్ధమతముపై నాదరము సన్నగిల్లినది. వేదమతముపై విశ్వాసము ప్రబలినది. తెలుఁగుదేశమున వేదములు నుపనిషత్తులు క్రొత్త శోభతోఁ జిగురెత్తి కుసుమింపఁ దొడఁగినవి. శ్రీముఖుని 'నాంది'తో నుపక్రమింపఁబడిన బౌద్ధమత నాటకమునకు శాలి

వాహనుఁడు భరతవాక్యము పాడెను. శ్రుతిమతమునకు స్వాగతము చెప్పెను.

సాతవాహనభూపతి యుభయభాషా ప్రవీణుఁడు. ఆతఁడు సంతతము గ్రంథావలోకనముతోఁ బండిత ప్రసంగములతోఁ గవితాప్రశంసలతోఁ గాలక్షేపము చేయుచుండెను. లీలావతీ ద్వితీయుఁడై యాతఁడు అలంకారశాస్త్రమునఁ బరిశ్రమించెను. న్యాయ మీమాంసాదులుకూడఁ బఠించెను.

---

## ౭

అది ఘోరారణ్యము. క్రూరమృగముల సంచారము చూపఱకు చిత్తభీతి నొదవించుచుండెను. దట్టమైన వృక్ష సమూహముచేఁ బట్టపగలు కూడ రాత్రి వలెనే కనిపించుచుండెను. నిశాచరులు పిశాచములు సంచరించు నీ మహారణ్యమున మానవు లుండుటయే సంభవము కాదు. అందులో, ఏకాంకిగా నున్న యీ మానవుఁ డెవ్వఁడు!

ఒత్తుగాఁ బెరిగిన యీ బవిరిగడ్డములో దివ్యసుందరమైన తేజోరేఖలు రసబంధురమైన కవితా వాహిని వెల్లువ కట్టుచున్నట్లు కనఁబడుచున్నది. నిలిచి వెలిఁగెడి మెఱపు తీఁగల వలె విరాజిల్లు నాయన కనుఁదమ్ములలోఁ దీవ్రమైన

తపోదీ ప్తి పొడసూపుచున్నది. ఆతఁడు మహర్షియో, మహ కవియో యూహింపనేరము.

మహర్షివలె నిరాశాభావముతో, నిస్పృహానేత్రము లతోఁ బ్రకృతి పరిశీలనము సేయును. మహాకవివలె నిశిత దృష్టితో భావనాభరిత సృష్టి చేయుటకు యత్నముచేయును. పరిసరమున నున్న ప్రకృతికి మూఁగచదువులు బోధించు విరాగివలె, దక్షిణామూర్తి యవతారాంశమువలె నతఁడు తోఁచుచున్నాఁడు. ఆతఁడెన్నఁడు మాటాడినట్టు కనుపట్టదు. అతని కేభాషయు వచ్చినట్లు తోఁచదు. దేవభాషగాని, ప్రాకృతముగాని, దేశభాషగాని యాతఁ డుచ్చరింపఁగా వినలేదు. మఱి, భాషరాని యతని నాశ్రయించి యిరువురు శిష్యులుండి రనఁగా నబ్బురముగా నుండదా?

అతనికి బుద్ధిపుట్టినపుడు శిష్యులకుఁ బాఠము చెప్పును. ఆ పాఠము పైశాచభాషలో సాగుచుండును. నాగరకుఁడైన పురుషుఁడు పైశాచము నుచ్చరించుటయేమి? వింతగానున్నది. ఆ పురుషుఁ డహోరాత్రము లేదియో వ్రాయుచున్నట్లే యుండును. భూర్జర పత్రములపై వాఁడిముల్లు పుచ్చుకొని తన రక్తము మషీరసముగా నుపయోగించి యతఁ డేదో గ్రంథము రచించు చున్నాఁడు.

ఆతఁడు రచించుచున్న గ్రంథపత్రములు దొంతులు దొంతులుగా శిష్యులు పేర్చి భద్రపఱుచుచుందురు. ఒకనాఁడు గురుని పరోక్షమున శిష్యులిట్లు సంభాషించుకొనిరి.

గుణదేవుఁడు:— నందిదేవా! మన గురువుల గ్రంథరచనము చాల నాశ్చర్యముగా నున్నది! ఏడు సంవత్సరములు దగ్గఱ దగ్గఱగా నయినది! గ్రంథ సమాప్తి యెప్పటి కగునో తెలియదు.

నందిదేవుఁడు:—అదే నేను ననుకొనుచున్నాను. శరీరమునందలి రక్తమంతయు హరించిపోవుచున్నది. గురువు లస్థిపంజరమువలె శుష్కించి పోవుచున్నారు. వేసినపీఠము తీసి నటులుండదు. ఏమి దీక్ష! ఏమి కవితాధోరణి!

గుణ:—అది యటులుంచుము. నందీ! గురువులు మొన్న నాకొక రహస్యము చెప్పినారు. నీవప్పుడుస్నానార్థము నదికి వెళ్ళితివి.

నంది:— అది నాకుఁ జెప్పవా ?

గుణ:— ఆచార్యులు సాతవాహనమహీపతి సంస్థానములో మంత్రులుగా నుండెడి వారఁట. ఆస్థాన విద్వత్కవిత్వ పదవికూడ వారిదేయఁట. సంస్కృత ప్రాకృత దేశ భాషలలో వారు కవిత్వము చెప్పఁగలరఁట.

నంది:— వింతగా నున్నదే! మఱి వారెపుడును పైశాచము తప్ప నితరభాష మాటాడ రేమి కారణమో!

గుణ:—కారణముకూడ వారేసూచించినారు. సాతవాహనమహారాజు కొలువులోఁ దాము చేసిన యొక ప్రతిజ్ఞకుఁ గట్టు వడి భాషాత్రయసన్యాసము చేయవలసివచ్చినదఁట.

నంది:— ఆ ప్రతిజ్ఞ యెందువలనఁ జేయవలసి వచ్చినదో చెప్ప లేదా!

గుణ:— లేదు. మఱి నే నడుగను లేదు.

నంది:— సెబాసు! మనగురువులు నాలుగు భాషలలో విశారదు లన్నమాట. చాలకాలముదాఁక వారు మౌనములో నుండెడివారు. అటు లుండియే పైశాచభాషలో వైదుష్యము సంపాదించినారు. చూచితివా! ఎన్నఁడును వారు మఱియొక భాష నుచ్చరింపనైన లేదు.

గుణ:— అవునుగాని, నందీ! నా కొక యూహ తోఁచుచున్నది. అది యెటు లుండునో యోచింపుము. మనగురువులు రచించిన గ్రంథ మీవిధముగా నడవిఁగాసిన వెన్నెల కాకుండ సాతవాహన మహీపతి కంకితముగా నిచ్చినచోఁ గీర్తిప్రతిష్ఠలతో వెలసి శాశ్వతముగా దేశమున నిలువఁగల దని తలంచుచున్నాను. ఆ మహారాజునకు మన యాచార్యశేఖరునిపై నపారమైన గౌరవాదరము లుండెడి వని తెలియుచున్నది. మన మిరువురము వెళ్ళి యా మహీపతిని దర్శించి గ్రంథమును జూపించి దానిలోని విశిష్టతను వివరించి చెప్పినచో నతఁడు కృతి గ్రహణమునకుఁ దప్పక యంగీకరించు నని తోఁచుచున్నది.

నంది:— 'బృహత్కథ' వంటి మహోత్కృష్ట గ్రంథమును గృతినందుటకు సాతవాహనుఁ డొక్కఁడే సమర్థుఁడు. కాని, నా కొకటి సందియము. ఎన్నఁడో కొన్ని సంవత్సరములకుఁ బూర్వము మనగురువులు తత్సంస్థానమున నుండెడివా రంటివి. నవప్రియుఁడు రాజ్యభారవహుఁడు నగు హాలునకు మనగురువరులు జ్ఞప్తిలో నుందురా? యని—

గుణ:— అట్లనకుము. హాలుఁడు సాహిత్యప్రీతికల రసజ్ఞుఁడు. గురువులను విస్మరించినను 'బృహత్కథా' గ్రంథ విశిష్టత గుర్తింప లేకపోవునా?

నంది:— నిజమే. రక్తము ధారవోసి రచించిన మహాగ్రంథము. ఆకథలు, ఆసన్నివేశములు, ఆవర్ణనములు, ఆకల్పనములు, ఆరసోచిత సంభాషణములు, ఆ యతిమానుషఘట్టములు, ఆ యత్యద్భుత సంధానములు రసికచక్రవర్తియగు హాలుని మనస్సు నాకర్షింపకపోవుట యేమి? ఏడులక్షల గ్రంథము! ఇట్టి బృహద్గ్రంథము తనపేర నంకిత మగుటయే ఘనముగా భావించి యాతఁడు విధిగా నంగీకరించును.

గుణ:— నందీ! సందేహము లేదు. మనము వెంటనే పోయి యాచార్యు ననుమతిని బడయవలయును. ఇంతకును వారి యభిప్రాయ మెటు లుండునో!

నంది:— తప్పక యనుమతింతురు.

గుణ:— కానిమ్ము. మనవిచేసి చూతము. యత్నించుట మనవిధి. ఫలితము దైవాధీనము.

—○○※○○—

౮

అదిగో, మహారణ్యము ప్రక్క నొక పర్వతము. ఆ కొండ మీఁద నతఁ డొక ఋషివలె నున్నాఁడు. అతని ముఖములో దుఃఖచ్ఛాయ స్పష్టముగా గోచరించు చున్నది. ధీరోదాత్తమైన యతని హృదయ మెంత గంభీరముగా నుండవలసియున్నదో, యంత బేలవడిపోవుచున్నట్లున్నది. అతని యెట్టయెదుట హోమకుండము ధగద్ధగాయమానమై వెలుఁగు చున్నది.

ఇరువురు యువకులు భూర్జరపత్రముల దొంతరలు తెచ్చి హోమకుండము దగ్గఱఁ జేర్చుచున్నారు. వారు గుణదేవ — నందిదేవులు! ఋషివలె గోచరించు నతఁడు గుణాఢ్య మహాకవి!! భూర్జరపత్రములపై రచింపఁబడినది 'బృహత్కథ'. ఆ బృహత్కథను గుణాఢ్యుఁడు హోమము చేయుటకుఁ బూనుకొన్నట్లు తోఁచుచున్నది. కానిచో, మండుచున్న చితాగ్ని ముందు గ్రంథపత్రములు చేర్చుటకుఁ గారణ మేమైయుండును?

గుణాఢ్యమహాకవి యగ్నికుండమునకుఁ బ్రదక్షిణిం చెను. ఆతని వెంట గుణదేవ నందిదేవులును వహ్నిప్రదక్షిణము గావించిరి. అప్పటి యా గురు శిష్యు లచ్చముగాఁ ద్రేతాగ్నిహోత్రములను దలఁపునకుఁ దెచ్చుచున్నారు. అమృతజ్యోతివై లోకమున శాశ్వతముగా విరాజిల్లఁగల యొక మహాగ్రంథమును భస్మముచేయు దురవస్థ తనకుఁ దట స్థించుచున్న దన్న దిగులుతో నగ్నిహృదయము మూఁడు వ్రక్కలైన దన్నట్లు గురుశిష్యులు విషణ్ణచిత్తులై కూరుచుండిరి.

ఒక్కింతతడికిఁ బరమనిశ్చలములైన గుణాఢ్యుని లోచనములు బాష్పసేచనమునఁ జెమ్మగిల్లినవి. ఆయన వహ్నిదేవునకు దోయిలించి యగ్నిప్రజ్వలనార్థమో యన్నట్లు నిట్టూర్పులు విడుచుచు నిట్లు 'సామిధేని' మంత్రములం బోని వాక్యము లుచ్చరింపఁదొడఁగెను:

"అగ్నిభట్టారకా! కొన్నియేండ్లనుండి నీకొఱకీగ్రంథమును రచించి భద్రపఱిచియుంచితిని. నీ వాఁడి నాలుకలు చాచి దయావీక్షణములతో 'బృహత్కథ'ను నీలోఁ గలుపుకొనుము. ఎక్కడ దోషమున్నదో, అక్కడఁబట్టి నిర్మూలముచేయు నీవంటి రసికుఁడు — నీవంటి పవిత్రుఁడు నాకృతి నందుకొన్నచో నంతకంటె ధన్యత యేమి కావలయును!

మహారాజుల సన్నిధిని జేతులు నలిపి సేవించి విసివి పోయితిని. నా కవితామృతధార నీకుఁ జూఱలిచ్చుచున్నాను.

మెచ్చి, నా బృహత్కథా కావ్యము నంగీకరించుము. ఇది యేడేండ్లు నాచేసిన తపస్సు పంట. శాతవాహన మహీజాని యీకృతి నామతించు నని యెంచి శిష్యులచేఁ బంపించితిని. పైశాచభాష యనా భూపతునకు నచ్చక నిరాకరించెనట.

ఇంతకును, నా గ్రంథము నీలో శాశ్వతముగా నిలిచి యుండు యోగమున్నది కాఁబోలు! కానిచో, రసిక చక్రవర్తి యగు హాలుఁడు భాషావేషములను బట్టి గుణాఢ్య గ్రంథమును ధిక్కరించుట తటస్థింపదు.

వహ్నిదేవా! వేన వేలు కష్టములు కాలము కడుపున నడఁగిపోయినవి. నాకృతి జానకీదేవి వంటి పవిత్రశీల యైనచో నీవే శీతలత్వము వహింపవచ్చును. ఎవరు చెప్పఁగలరు! నా ప్రాణపాత్రీ రచనమైన 'బృహత్కథ'ను స్వీకరించి యీ పేదపండితుని దీవింపుము."

గుణాఢ్యమహాకవి కన్నులనుండి తొరఁగు బాష్పకణములచే బృహత్కథాగ్రంథపత్రములు చెమ్మగిలినవి. చెమ్మ వడిన కృతిపత్రములు వహ్నికి ముట్టించి వెచ్చపెట్టఁ దలఁచి నాఁడు కాఁబోలు! పాపము! ఒక్కొక్క భూర్జరపత్రమే శిష్యుఁడు గయికొని డగ్గుత్తికతోఁ బఠించుచున్నాఁడు. పఠనానంతరము గురువు పత్రమందుకొని యశ్రుసిక్త నేత్రములతోఁ దాని నగ్నికుండమున నాహుతి నొసఁగుచున్నాఁడు. అది ఘోరమైన కావ్యహోమము.

కవితారస పిపాసతో నగ్ని దేవుఁడు నాల్కలు చాచుకొని యొక్కొక్క యాకే యందుకొనుచుండెను. తన కావ్యములోని యొక్కొక్క యాకు దగ్ధమగుచుండఁగా గుణాఢ్యునకు హృదయశతపత్రము నందలి యొక్కొక్క రేకు మాడి యూడి పోవుచున్నట్లుండెను. పరమాద్భుతములగు కథాసన్ని వేశము లెన్ని తఱిగిపోయినవో! ధీరోదాత్తులగు కథానాయకు లెందఱు సురిగి పోయిరో! అపూర్వ సుందరములైన యెన్ని 'పాత్రలు' బూడిదపాలయ్యెనో! అతిలోక మనోజ్ఞములైన యెన్ని వర్ణనాత్మక ఘట్టములు నుసియైపోయెనో! వేలకొలఁది మహాకథలు! లక్షలకొలఁది యుపకథలు!! పిచ్చుకగూఁడల్లి నట్లుగా నున్న గాథా సంధానము.

అట్టి మహోత్తమ గ్రంథము 'బృహత్కథ' యీవిధముగా నాహుతి కావలసిన దేనా! ఏడులక్షల గ్రంథము! ఎన్నాళ్ళు పరిశ్రమించి, యెంత రక్తము దారవోసి, యెంత మేధావిశేషము ప్రదర్శించి రచింపఁబడిన గ్రంథమో! అక్కటా! తాను గని పెంచిన కావ్యసుందరిని చేతులార గుణాఢ్యుఁడు వీతిహోత్రున కర్పించుచున్నాఁడు. ఆఁతఁ డెంత నిర్దయుఁడో!

౯

"మహాప్రభూ! చాల వింతగా నున్నది. మేమెక్కడ నెప్పుడు చూడలేదు. ఆయన యెవరో తెలియదు. ఋషివలె నున్నాఁడు. ఆయనవెంట నిరువురు యువకు లున్నారు. వారు శిష్యులఁట. ఆయన వారికి గురువఁట. బుజపత్త్రిరి శేకులపై నాయన కైతకట్టి వ్రాసిరని చెప్పుకొనుచున్నారు.

కొండమీఁద నొక యగ్నికుండము శిష్యులు సిద్ధము చేసిరి. ఆశిష్యులలో నొకఁడు భూర్జరపత్రములపై నున్న యేదో గ్రంథము చదువుచు నొక్కొక్క పత్రిమే గురువున కందిచ్చుచుండును. ఆయాకు గురువు వహ్నికుండములోఁ బడవేయుచుండును. ఆయన కన్నులు చెమ్మగిల్లి యుండును. చిత్రములోఁ జిత్రము! ఆప్రాంతముననున్న పశుపక్ష్యాదులు సైతము చుట్టుచేరి యాగ్రంథము నాలకించుచున్నవి. నిద్రాహారములు మాని యహోరాత్రము లా పఠన మట్లు సాగుచుండఁగా నడవిజంతువు లాలించుట యద్భుతముగా నున్నది. ఆభాష మాకుఁ దెలియదు.

దేవరవారు దయచేసి యీ ఘోరము తొలఁగింపవలయును. అది యేమిగ్రంథమో, ఆతఁడెవఁడో, ఏకారణ

మున నాగ్రింథము హోమముచేయుచున్నా(డో చిత్తగింప( గోరుచున్నాము.''—

వేగరుల విన్నపమువిని సాతవాహనమహీపతి నిర్విణ్ణు( డయ్యెను. ఒక్క క్షణకాల మాత్ర(డు వారి మాటలు విశ్వ సింపలేకపోయెను. పిమ్మట విశ్వసించియు నాహుతిచేయ(బడు చున్నది యొక గ్రంథమని నమ్మలేకపోయెను. ఏది యెటు లైన నచ్చటకు వెళ్ళుటయే యుక్తమని నిశ్చయించుకొనెను.

చారులు దారిచూప(గా హాలప్రభువు కావ్యహోమము జరుగు కొండకొమ్ము దరిసెను. ఆత( డించుక దవ్వుల నుండ( గనే చిటచిట ధ్వనులతో మండుచున్న వహ్నికుండము కంట( బడెను. దగ్గఱకు వచ్చుచున్నకొలఁది హాలరాజున కేదో చెప్పరాని హృదయపరితాపము ప్రారంభమయ్యెను. జరుగు చున్న ఘోరకార్యమునకు( దానే కారణ మన్నభావ మత నికి( బొడమెను.

ప్రదీప్త శిఖా సముజ్జ్వలమైన చితాగ్నిహోత్రము వే(డి హాలభూతల నాధుని ఫాలమునకు సో(కెను. వహ్నిజ్వాలల యంతరములనుండి యొక మహానుభావుని, ఒక మహాకవిని, ఒక పూర్వమిత్రుని దర్శించి యీ తెలు(గుఱే(డు నిశ్చేష్టు(డయ్యెను. తానుజూచిన మహాకవి యశ్రుధారలచల్ల(దనము కొంత శాంతపఱచెనో యన్నట్లుగా, హాలుని హృదయ ముత్తరక్షణ

మునఁ బ్రకృతిలోనికి వచ్చెను. అంతలో నామహీపతి కొక్క యమృతస్మృతి.

"ఓహో! గుణాఢ్యమంత్రిలా? ... మహాత్మా! ద్రోహము; కావ్యాహుతి చేయుచున్నారా? మా ప్రార్థన మాలించి గ్రంథహోమము చాలింపుఁడు చాలింపుఁడు".

హాలప్రభువునకుఁ గంఠము గాద్గద్యము వహించెను. అతఁ డగ్నిజ్వాలలలో సగము సగము కాలిపోవుచున్న భూర్జర పత్రము బయటికి లాగి చల్లారఁబెట్టి వహ్నిశిఖల కందిచ్చు వేఱొక పత్రమును బ్రక్కకు నెట్టి, మహాకవి చరణయుగమును ముట్టెను. సాతవాహనప్రభువు రాక నరసియో యన్నట్లు వీతిహోత్రుఁడు తన మంటల నణంచుకొనెను. కావ్యపఠన దీక్షలోనున్న గుణదేవ నందిదేవులకు జీవముపోసినట్లు మహానందము కలిగెను.

గుణాఢ్యుఁడు మౌనవ్యాఖ్యతో సాతవాహనభూపతిని కౌఁగిలించుకొని యశ్రువులతో నాతని భుజములు తడిపెను. ఎన్నాళ్ళ యెడఁబాటు! ఏడేండ్లు పయిగా నయినది గుణాఢ్యుఁడు హాలసంస్థానము విడిచివచ్చి. ఏయొక్కనాఁడును గుణాఢ్యుని చూడకుండ హాలుఁ డుండెడివాఁడు కాఁడు. ప్రతి క్షణము గుణాఢ్యునకు హాలస్మరణయే. అట్టి దృఢస్నేహ పాశమును దెగఁద్రెంచుకొనియున్న మానిని నేఁడు దర్శించి హాలపతి యెట్టియానందమనుభవించెనో! అది నిర్వచింపరానిది.

అంతట, గుణాఢ్యుని ప్రక్క నంజలిబంధములతో నిలఁబడియున్న గుణదేవ నందిదేవులను హాలరాజు కనుఁగొని యొకానొక తలంపు తెచ్చుకొని కవివరునెదుట దోయిలివట్టి యీతీరున వచించెను:

"మహాత్మా! ఈ యువకుల నిరువురను జూడఁగా మా కొక విషయము జ్ఞప్తికిఁ దగులుచున్నది. కొన్నాళ్ళక్రిందట వీరిరువురు భూర్జరపత్రస్థమైన యొక గ్రంథను మాకడకుఁ దెచ్చి చూపించి "యిది మాగురువుల రచన యనియు దీని నంకితముగా గ్రహింపుఁ" డనియుఁ జెప్పినారు. తామే వారికి గురువులై యుండిరని మేము నమ్మనేరక కృతిస్వీకారమునకు నిరాకరణము చేసియుంటిమి. భాష పైశాచమనియు, వ్రాఁతరక్తమయమనియుఁ బత్రములు భూర్జర పత్రములనియుఁ జెప్పఁగా మా కది యేదో వింతగాఁ దోఁచినది. అది కారణముగాఁ దిరస్కరించినమాట వాస్తవము. అంతమాత్రముననా యీగ్రంథహోమము! కవిత్వసుందరి నీవిధముగా భస్మము చేయుట భావ్యముకాదు. మా పరిపాలనములో నిట్టి దారుణ కార్యము జరుగుట మాకేకాదు, మా సామ్రాజ్యమునకే నష్టహేతువు. మా యపచారము మన్నించి పూర్వస్నేహము పాటింపవలయునని వేఁడుచున్నాము. బృహత్కథా శేషమునకిదే మా యంజలి."

సాతవాహనమహారాజు ప్రార్థనమునకుఁ బశ్చాత్తాపమునకు గుణాఢ్యుని నిండుడెందము కరఁగి, కరుణాభరిత

మయ్యెను. దగ్ధశేషములైన కృతిపత్త్రిములు చూపి గుణాఢ్యుఁడు మహానమధురమైన కటాక్షముతో హాలరాజు ననుగ్రహించెను. హాలప్రభువు బృహత్కథకు దోయిలింబట్టెను.

గుణాఢ్యునితో నెన్నో నూతన విషయములు ముచ్చటింపవలయునని హాలుఁ డువ్విళ్లూరినాఁడు. కాని, గుణాఢ్యుఁడు సంస్కృత ప్రాకృత దేశభాషలలో మహాని. పైశాచము హాలరాజున కర్థముకానిభాష. ఇంకఁ గవి రాజుల పరస్పర సంభాషణ మెట్లు? ప్రతిజ్ఞా నిర్వహణమునకై యలనాఁడు కొలువువీడునపుడు గుణాఢ్యుని నోటనుండి వెలువడిన మాటలు స్మృతికిఁ దెచ్చుకొని హాలుఁడు నిట్టూర్చెను.

శిష్యులకు సన్న చేసి, యామహాకవి "పైశాచము"లో నీతెఱఁగునఁ దన చరమసందేశము వినిపించి హాలప్రభువునకుఁ బ్రాకృతములో ననువదించి చెప్పవలసినదని యాజ్ఞాపించెను.

"సాతవాహన మహారాజా! నీయశస్సు యావదాంధ్రమున నేకాక యావద్భారత దేశమునను సదాతనమై యుండఁ గలదు. నీవు కవివి. కవివత్సలుఁడవు. నీవంటి మహాప్రభువునుగన్న యాంధ్రదేశము నిజముగాఁ బరమధన్యమైనది. ప్రాకృతభాషలో నద్వితీయమైన నైదుష్యమును సంపాదించి, యొకానొకపట్టుదలతో నాయుమానములలో గీర్వాణసారస్వతము నెల్లఁ బుడిసిలించి, దేశభాషలోఁ బ్రతిభాసంపద గడించి, "గాథాసప్తశతి" కావ్యసంకలనముచే

నమృతమధురమైన రచనాపాటవమును బ్రకటించి, మహా కవుల కెందఱకో యాశ్రయ మిచ్చి, నూతన శకస్థాపకుఁడవై, కవివత్సలుఁడవై, దుర్వారబాహుబల సంపత్సమేతుఁడవై, నిరస్తసమస్త శాత్రవుఁడవై వెలసిన ప్రభుమౌళివి. నీ చరిత్ర యాదిక్షత్రశిరోమణుల చరిత్రములకు దీటు వచ్చునది. భావిరాజేంద్రులకు నీసాహిత్యరక్తి యొరవడియై పరిఢవిల్లఁగలయది. ఒకవంక రాజ్యతంత్రములు దిద్దుకొనుచు, వేఱొక వంక వాఙ్మయమును సేవించుకొనుచు సాగించుచున్న నీజీవిత యాత్ర యాంధ్రరాజచరిత్రమునఁ బ్రథమోదాహార్యమైనది.

కవుల నెంత యాదరముతోఁ జూచి గౌరవించితివో, కవయిత్రులనుగూడ నంత యాదరగౌరవములతోఁ దిలకించిన విశాలహృదయుఁడవు. అణులక్ష్మి, అనుపలబ్ధ, రేవ, మాధవి మున్నగు కవయిత్రీ రత్నములు నీకీర్తికిరీటాగ్రమున విరాజిల్లు చుందురు.

కారణాంతరములచే నీసేవాభాగ్యమునకు దూరమై యీ కాంతారమున నున్నను, హాలరాజు గుణాఢ్యహృదయమున నిత్యనివాసి. పైశాచభాషలో రచింపఁబడిన యీ 'బృహత్కథ' దగ్ధశేషము నీకు హృదయపూర్వకముగా నర్పించు చున్నాను. ఆఱులక్షలగ్రంథ మిందాఁక భస్మమైనది. ఇంక మిగిలినది యొక లక్షగ్రంథము.

వీరు గుణదేవ నందిదేవు లను నాశిష్యులు. వీరివలనఁ బైశాచభాష నభ్యసించి యీగ్రంథమునకుఁ బ్రచార

ప్రశస్తులు తేవలయునని కోరుచున్నాను. నీ 'కథాపీఠము'తో 'బృహత్కథ' ప్రపంచసాహిత్యమున ధ్రువతారయై విరాజిల్లుఁగాక!"

గుణాఢ్యుని చరమసందేశము మృదుముగ్ధమైన సంస్కృతభాషలో ననువదించి నందిదేవుఁడు సాతవాహనమహారాజునకు వచించెను. సాతవాహనుని మేను హర్షపులకితమయ్యెను. ఆ జేని దోసిలిలో గుణాఢ్యుని యామోద మేదురకటాక్షప్రసవములు పడి యందగించి పరిమళించెను. గుణాఢ్యకవి యోగమార్గముచేఁ దనుత్యాగము చేసికొని పునరావృత్తిరహితమైన దివ్యపదము నలంకరించెను.

సాతవాహనుఁడు 'పైశాచము' కూలంకషముగా నభ్యసించి 'బృహత్కథా'కృతి ప్రశస్తి గుర్తించి దానికిఁ గథాపీఠము వెలయించెను. 'బృహత్కథ' కాలవశమున నేఁడు కానఁబడకున్నను, తద్గ్రంథపోషకుఁడైన సాతవాహనుని కీర్తిని స్థిరముచేసిపోయినది. సామ్రాజ్యాధిపతులలో నింతటి సారస్వతప్రీతి కలవారెందఱుందురు? ఇన్ని వాఙ్మయములలోఁ బాండిత్యము గడించినవారెందఱున్నారు? హాలరాజా! తెలుఁగుచరిత్రలో నీవు నిజముగా నమృతజ్యోతివి.

---

# మాధవవర్మ.

## ౧

అది నడిరేయి. గుడ్డివెన్నెలసాయముతో నొక చిట్టడవిదారిఁబడి ప్రయాణము సాగించుచున్న యామెయెవరు? ఈ యర్ధరాత్రమున నామె యెక్కడకుఁ బోవుచున్నది? ఆమె ముందు వేఱొకస్త్రీవ్యక్తి మార్గదర్శకురాలై నడచుచున్నది. ఆమె వేసమునుబట్టి చూచినచో దాసివలెను, వెనుకనున్న యిల్లా లొకరాజపత్నివలెను స్పష్టపడుచున్నది.

ఎండకన్నెఱుఁగని సుకుమారగాత్రి, కాలు క్రిందఁబెట్టినచోఁ గందిపోవు పూఁబోఁడి, చూలాలివలె సత్తువలేక నడువలేక నడచుచున్నది. ఆమె నిట్టూర్పు గాడ్పులసందడి ప్రకృతి నిశ్చలతను భంగపఱచుచున్నది. ఒకానొక సంభ్రమముతో మిట్టపల్లములలోఁ దడఁబడుచు నడువవలసిన యవస్థ యామె కేల కలిగినదో! దాసి చేయూఁతనీయఁగా నా యంగన పాపము! కంటకావృతమైన త్రోవవెంట నడచి నడచి బడలి నిలఁబడిపోయినది. దాసి కనులలో నశ్రువులు గిఱ్ఱున దిరిగినవి.

"అమ్మా! నీ కెటువంటి దురవస్థ తటస్థించినదమ్మా! ఒక సామ్రాజ్యనేతకుఁ బట్టమహిషివై యుండి, స్వర్ణపీఠము నుండి కాలుకదపని భాగ్యవతిగా బ్రతికి తుదకీ దిక్కుమాలిన కాలిబాటలలో సంచరింపవలసి వచ్చినది. పైగా, నెనిమిది నెలల గర్భిణివి. దుర్భరమైన దుఃఖము దిగమ్రింగుకొని యర్థరాత్రమునఁ బ్రయాణించుట! మహారాజ్ఞీ! నాకడుపు తఱుఁగుకొని పోవుచున్నది.

రాణి:—చారుమతీ! దైవము ప్రతికూలించినప్పుడు మన మేమియుఁ జేయఁజాలము. తొలిజన్మమున నేనుజేసిన పాపము లిట్లు కట్టి పీడించుచున్నవి. నన్నెక్కడకుఁ గొంపోవుచున్నావు! నీ బలవంతముచే నడచుచున్నాను గాని బొత్తిగా నోపికలేదుసుమా!

చారుమతి:—ఓపిక యెటులుండునుతల్లీ! నీ వెప్పుడైన నిట్టి ప్రయాణముచేసి యెఱుఁగుదువుకనుకనా? ఈముండ్లలో నీవంటి రాణినిట్లు నడపించుచున్న నేనెంత దుష్టురాలను!

రాణి:—నీవేమి చేయుదువు? నాయదృష్ట మిట్లున్నది. ఆ దుష్టుఁడు కటకరాజు కత్తితో నన్నుఁగూడ నుత్తరించిన నిట్టికష్టము లేకపోయెడిది, ఈ యనాథప్రాణమును సంరక్షింపఁ జూచుచున్నావు. చారుమతీ! నీకును నా యెడలఁ గరుణలేదా?

చారుమతి:—మహారాజ్ఞీ ! యెంతమాట యనుచున్నావు ! ప్రధానామాత్యుని యాదేశానుసారము నీ గర్భస్థమైన వంశాంకురమును గాపాడుటకుఁ దీసికొని వెళ్లు చున్నాను. ఎన్నికష్టములకు లోనైనను సంతానము నిలుపుకొనుట యవశ్యకర్తవ్యముకదా! దుర్లలితుఁడైన కటకరాజు బల్లహుఁడు రావణునివంటివాఁడు. వాని కంటఁబడకుండ వెలుఁగురాకుండ మనము 'అనుమకొండ' చేరుకొనవలయును. నాబుజము నవలంబనము చేసికొని ధైర్యము వహించి యడుగువేయుము.

రాణి:—అయ్యో ! దైవమా !

చారుమతి:—నిండుచూలాలివై యడవివెంట నడయాడు చున్న నీయవస్థ చూడఁగా, శ్రీరామ పరిత్యక్తయై కాననములో దిక్కుగానక సంచరించు జానకీదేవిగాథ తలంపునకు వచ్చుచున్నది.

రాణి:—ఆ తల్లితో నీదురదృష్టవంతురాలిని పోల్చుచుంటివా?

చారుమతి:—సుక్షత్రియుఁడగు సోమదేవ భూపాలుఁడు సామాన్యుఁడా? తల్లీ ! అట్టి ప్రభువరునకుఁ బట్టమహిషివై వెలసిన నీభాగ్య మేమంతతక్కువ?

రాణి:—చారుమతీ ! నా కుడికన్నదరుచున్నది. కటకరాజు బల్లహునితో యుద్ధము చేయుచున్న ప్రాణేశ్వరుని గూర్చి దిగులుగానున్నది. వానికి బాసట యెవరేని

యుండిరో లేదో! భర్త నెడఁబాసి స్వప్రాణ రక్షణ మునకై యత్నించుచుంటిని. ఛీ. నాబ్రతు కెందులకు!

చారుమతి:—అమ్మా! అధైర్యపడకుము. పూర్ణగర్భవతివై యుండి యీ విధముగా విలపించుట మంచిదికాదు. అనుమకొండ దరియ వచ్చుచున్నాము. తెలవారకుండ నాయూరఁ బ్రవేశించవలయును. మహామాత్యుఁడు నా కిటు లాదేశించినాఁడు. 'బల్లహుని బరిమార్చి సామ్రాజ్యము నేలఁగలబిడ్డ రాణికడుపున నున్నాఁడు. వాని భద్రత యవసరము. నీవు జాగ్రత్తగా మహా రాజ్ఞిని గొంపోయి యనుమకొండఁ జేర్పు" మని.

రాణి:—అయ్యో! ఏమే చారుమతీ! చల్లఁగా జెప్పుచున్నావు. పృథువున కేదేని యిక్కట్టు రాలేదుకద! ఆత్మహత్య చేసికొందమన్న చోఁ గడుపుకోఁతయొకటి! ఇస్సీ! ఎంత నిర్భాగ్యజీవిత మైనది!

చారుమతి:—కడచినదానికి వగచి కార్యములేదు. రాజ్య తంత్ర ధూర్వహుఁడగు ప్రధాని చెప్పినట్లు మనము చేయుట శుభోదర్కము.

రాణి:—శుభోదర్కము! నా బ్రదుకునకింక శుభముకూడనా! కందారపుర దుర్గమును దాఁటివచ్చిన క్షణమునఁ నా జీవిత మొక దుర్గమారణ్యమునఁ బ్రవేశించినది.

కానిమ్ము. అనుమకొండలో మన కాశ్రియమిచ్చువా
రెవరు ? మనల నాదరించువా రెవరు ?

చారుమతి:—భక్త రక్షకుఁడు 'మాధవుఁ' డుండఁగా మనకు
లోటేమి ?

## ౨

సోమదేవుఁడు కందారపురము రాజధానిగా నాంధ్ర
దేశమును బరిపాలించుచుండెను. అతని తండ్రి విజయపాలుడు.
విజయపాలునితండ్రి నందభూవరుఁడు. సోమదేవుఁడు తాత
తండ్రులను మించి ధర్మ నిబద్ధ బుద్ధియై రాజ్యపాలనము సేయు
చుండెను. ఆతని పరాక్రమసంపదకుఁ బరనరపతులు వెఱఁగు
పడి పలాయితు లగుచుండిరి. మల్లికార్జున దేవునిపై సోమ
దేవునిభక్తి యద్వితీయమైనది. ఆతఁ డెంతభక్తుఁడో అంత
ధర్మాసక్తుఁడు.

గోవులయెడల న్నా మహీపతికిఁ గల భక్తిభావ మపార
మైనది. సువిశాలమైన యాతని గోష్ఠమునందుఁ గొన్నివందల
ధేనువులు నిరంతరము పూజింపఁబడుచుండును. చిత్రవర్ణ
భాసురములగు నావులను బరికింపవలయునన్నచో సోమదేవుని
గోశాలకుఁ బోవలయును. దేశములో నెక్కడనున్న కపిల

గోవులను గొని తెచ్చి తన యాలమందలో నుంచుకొనుట యాతని కొక ముచ్చట.

కుంభపొదుఁగులు నేల నంటఁగాఁ, బచ్చిక మేసి సమీప నదీతోయములు త్రావి తన్పుతోఁ దఱపిదూడలను నాకి పాల చేఁపుల నొలికించు నాలమందలలో సోమదేవుఁడు ప్రాతస్సాయం సమయములయందు గోపాలకునివలెఁ దిరుగాడుచుండును. భద్రాచలమునందును, మంత్రకూటమునందును సోమదేవునకు ధేనుసంఘము లున్నవి. ఆసంఘముల సంరక్షణమున కధికారివర్గము నేర్పఱచి యతఁడు పుణ్యాకాంక్షతో వానిని పోషించుచుండును. కోటలోని సౌధోపరిభాగమునుండి సోమదేవుఁడు ప్రభాతమున మేల్కొనిన వెంటనే సహస్రగోదర్శనము చేయుచుండును. ప్రతి ప్రాతఃకాలమున నామహారాజు గోష్ఠప్రదక్షిణము సేయుచుండును. పంచగవ్య ప్రాశనముతో సుపవిత్రమైన నాతని దేహము పరిమళించుచున్న బంగారువలె భాసిల్లుచుండును.

రత్నాభరణములతోఁ, బంగారు తొడుగుల శృంగములతోఁ, బసుపుఁగుంకుమలు కలిగిన మోములతో సోమదేవుని యావులు కంటఁబడినపుడు నిజముగా గోలోక సందర్శనానందానుభూతి కలుగును. జాము జాము చేఁపి పొదుఁగొండని పాడియావులు కొన్నివంద లాతనిమందలోఁ గలవు. గోప్రదక్షిణము భూప్రదక్షిణము వంటి దని యాతనికి

సంపూర్ణమైన విశ్వాసము కలదు. సర్వ దేవతలు గోమాతలో నుందు రని యాతనికి నమ్మకము.

గోవులను, ధరణీదేవులను, దేవదేవుని నిరంతరార్చనలతోఁ దనుపుచు సోమదేవుఁడు కందారపురరాజ్యము శాత్రవ బృంద భయంకరముగాఁ బరిపాలించుచుండెను. సోమదేవ భూపాలుని పట్టపురాణి సిరియాలు దేవి. ఆమె పతి కనుగ్రవతియై సుగుణశీలోన్నతయై పేరుగాంచెను. గోసేవావ్రతమున సోమ దేవుఁ డెంత శ్రద్ధాపరుఁడో, సిరియాలు దేవి యంత శ్రద్ధావతి. ఆరాజదంపతులు గోష్ఠ ప్రదక్షిణము చేయునపుడు చూపఱకు నేత్రోత్సవముగా నుండును.

నేఁడు సోమదేవభూపతుని కపూర్వమైన వేడుక. ఎన్ని భాగ్యములు పట్టినను బుత్రసంతానభాగ్యమున కతఁ డిందాఁక నోఁచలేదు. ధేనుపూజాఫలముగా 'సిరియాలు దేవి' గర్భవతి యైనదన్న వార్త సోమదేవుని చెవిలో సుధాబిందువులవలెఁ బడెను. ఆ ప్రభువున కింక వలసిన దేమి!

ఏనాఁడు చెవులపండువగు వార్త నాలించెనో, ఆనాఁడే గుండెదిగులు కలిగించు నొక యుదంతము సోమదేవభూకాంతుఁడు వినవలసివచ్చెను. చంద్రునిలోఁ గళంకము!

గూఢచారుఁడొకఁడు మహారాజును దర్శించి నమస్కరించి యిట్లు వచించెను: "ప్రభూ! తెలుఁగుదేశము నాల్గు చెఱఁగులు తిరిగి పరికించితిని. ఎక్కడ విన్నను దేవరవారి

గుణగణములను బ్రశంసించు వాక్యములు మారుమ్రోగు చున్నవి. ప్రభువుల గోసేవాపై భవమునుగూర్చి, దైవభక్తిని గూర్చి, ధర్మపాలనమునుగూర్చి జనులు ముచ్చటించుకొను చున్నారు. కాని, ఒక్క విషయము మనవిచేయుటకు నాకు భయముగానున్నది. కటకరాజు బల్లహుండు దుష్టభావముతో, గందారదుర్గము ముట్టడించుటకుఁ జాలనాళ్ళనుండి రహస్య యత్నములు చేయుచున్నాఁడఁట. ఒక భూగృహములో సైన్యమునుంచి పోషించుచు నాకస్మికముగాఁ బ్రభువులకోట నాక్రమింపఁదలఁచెనఁట. కటకదేశమునందలి సంచారములో నీ రహస్య మెట్లో తెలిసికొనఁగలిగితిని."

సోమదేవుఁడు సహజగంభీరుఁడు. చారుఁడు చెప్పిన యీ వార్త విస్ఫారితనేత్రములతో నర్థము చేసికొని "బల్లహుఁడా? కందారదుర్గము నాక్రమించుటయా? సరే కానిమ్ము. అతనికిఁ బోఁగాలము దాపురించినదికాఁబోలు!" నని యంభో ధర స్వరగంభీరముగాఁ బలికి గూఢచారుని బంపివైచెను.

అంతట రాజసౌధమున నేకాంత ప్రదేశములోఁ బ్రధానమంత్రిని గానిపించుకొని కందారవిభుఁడు భావికార్య మునుగూర్చి మంతనములు నెఱపెను.

రాజు:—కటకరాజు బల్లహుఁడు కుతంత్రములు పన్నుచున్నాఁ డని చారుఁడు చెప్పినాఁడు. ప్రధానీ! దుర్గ సంరక్షణ

మున నపరిమిత్తులై యుండవలె నని దండనాయకుల కాజ్ఞాపింపుము.

ప్రధాని:—ప్రభూ ! మొన్న నేకదా మనరాజధానికి వచ్చి మనము చేసిన విందు గుడిచి పోయినాఁడు ! నాఁడు బల్లహుఁడు నెఱపిన నెయ్యమంతయుఁ గయ్యమునకు దారితీయుచున్న దన్న మాట !

రాజు:—చిరకాలమునుండి యీ దుండగీఁడు మనపై దండెత్తి వచ్చుటకు సైన్యపోషణము చేయుచున్నాఁడఁట. మనము చేసిన విందులో నతఁడు తేనె లొలికించుచు మాటాడినాఁడు. కటకమునకు నాంధ్రదేశమునకుఁ బ్రేమానుబంధములు పెంపొందవలెననియు, దేశము శాంతిభరితమైయుండుటకు యుద్ధప్రయత్న విరమణ మవసర మనియు, సైన్యాధిక్యము రాజ్యరక్షణకు సాధకము కారాదనియు, నహింసామార్గ మవలంబించుట దేశక్షేమహేతువనియు నుపన్యసించి పోయి నాఁడు. ఆమాటలన్నియు "విందుమాటలు" కాఁబోలు!

ప్రధాని:—బల్లహుని వినపుమెచ్చులు, మీసాల తేనెలు నాఁడు గుర్తింపలేకపోయితిమి. ఇంతకు, బల్లహుఁడు మనదుర్గ మార్గ రహస్యములు కనిపట్టుటకు నాఁడు వచ్చియుండ వచ్చును. ప్రభూ! మనకుమాత్ర మిప్పుడు సైన్యపుఁ గొఱఁత యే మున్నది! గజ తురగ పదాతి వాహిని

వలసినంత యున్నది. అదిగాక, ఆంధ్రవీరు లెందఱో మన పోషణమున నున్నారుగదా! కదనరంగము పేరు చెప్పినచో వదనములు వికసించు జోదులు వారు, కందార దుర్గముపై నీగకూడ వాలనీయరు.

రాజు:—సరే. జాగరూకతతో నుండవలసిన సమయము వచ్చినది.

---

## 3

'అనుమకొండ' చిన్నదైనను సొగసైన యూరు. ఆయూరి కెల్లఁ బద్మాక్షీ దేవతాలయము రక్షాబంధముగ నుండెను. పది యిండ్లకుఁ దక్కువగాకుండ బ్రాహ్మణాగ్రహార మాగ్రామమున నుండెను. ఆయగ్రహారములోని పదియిండ్లవారును బాడిపంటలకుఁ గొదువలేని సంపన్నులు. అందఱును వేదశాస్త్రము లభ్యసించిన కర్మఠులు. వారిలో మువ్వురు నలువురు విప్రోత్తము లగ్నిష్టోమాది యాగములుచేసిన యజ్వలు. సాధారణముగా వారిలో నెవ్వరును గాలుకదిపి పెఱచోట్లకు వెళ్ళరు. అరుఁగులపైఁ గూర్చుండి శ్రుతిస్మృతి పురాణాదులనుగూర్చి ముచ్చటించుకొనుటయో, శిష్యులకుఁ బాఠములు చెప్పుకొనుటయో తప్ప వారికి. రాజకీయములతో సంబంధములేదు.

అతిథులు, నభ్యాగతులు నసంఖ్యాకముగా నగ్రహార మునకు వచ్చుచుందురు. అర్ఘ్యపాద్యాదులతో నచ్చటివారు నెఱపు నాతిథేయము శ్లాఘాపాత్రమైనది. అగ్రహారము వీథివెంట వెళ్ళినచో, నొకచోట ఋగ్వేదపాఠము, ఒకవంక సామగానము, ఒకప్రక్క యజుర్మంత్రధ్వానము, ఒకదిక్కు పాతంజలము, ఒకచో వ్యాకరణాది శాస్త్రాధ్యయనము చెవుల పండువుగా నుండును. అనుమకొండ కా యగ్రహార మొక నిండు శోభ తెచ్చినది.

క్రైస్తవశకమునకుఁ దొలినాఁడాయూరి ప్రాంతమంతయు నెఱుక రాజ్యములోనిది. 'అనుమకొండ' యను పేరువచ్చుట కొక కారణము చరిత్ర యీవిధముగాఁ జెప్పుచున్నది:

"ఒక కిరాతుఁడు శ్రీపర్వతక్షేత్రప్రాంతమునందలి యరణ్యమున నిచ్ఛావిహారవర్తియై యనుచరవర్గముతో సంచరించుచుండెడివాఁడు. అతఁడు పరాక్రమశాలి. మెల్లమెల్లఁగా నరణ్యపరిసరపుఁ బల్లియల నాక్రమించుకొని 'హనుమాద్రి'పై నివసించుచు నా కిరాతుఁడొక చిన్న రాజ్యమును నెలకొల్పెను. ఒక దుర్గమును నిర్మించెను. ఒక గ్రామమును గట్టెను. ఆ బోయ ఱేని పేరు 'ఎఱుక దేవరాజు'. ఆ రాజునకు "అనుముఁడు - కొండఁడు" అను పేళ్లుగల యిద్దరు కుమారులు పొడమిరి. క్రమముగాఁ దండ్రి యనంతరము వారి కారాజ్యము ప్రాప్తించినది. ఆ కారణమున హనుమాద్రికి వారి పేళ్ళకలయికతో 'అనుమకొండ' యను పేరు స్థిరపడెను."

ఈగాథనుబట్టి చూచినచో నొకనాఁడు 'అనుమకొండ' యనాగరకప్రాంతమైనట్లు తోఁచినను గథాకాలమునాఁడు వేదశాస్త్రకళానిలయమై యుండెడిది.

అనుమకొండ యగ్రహారములోని విప్రసంఘమున కెల్ల విద్యావయోవృద్ధుఁడైన 'మాధవశర్మ' నాయకుఁడు. అతని నాయకత్వము నిరంకుశమైనది కాదు. అక్కడి వారందఱు మాధవశర్మ మాటమీఁద భక్తివిశ్వాసములు కలిగియుందురు. మాధవశర్మయు వారివారి చిత్తములు నొవ్వకుండఁ దగవు తీర్పులలోఁ బెత్తనము నెఱపుచుండును. ఆతఁడెంత వైదిక నిష్ఠాపరుఁడో, అంతకుమించిన లౌకికజ్ఞానము కలవాఁడు. శ్రుతిస్మృతిపురాణములలో నాతఁడెఱుఁగని రహస్యములేదు. రాజకీయతంత్రములలోఁ జాణక్యుఁడు. అచ్చటి యాగ్రహారికులలో నాతనికున్నంత పంటభూమి మఱియెవ్వరికిని లేదు. ఆతని కున్నదంతయు ముక్కారుఁ బండు సుక్షేత్రఖండము. పుత్రులతోఁ, బౌత్రులతో, దుహితలతో, దౌహిత్రులతో నాతనియిల్లు దోఁసతోఁటవలెఁ గన్నులపండువుగా నుండును. మాధవశర్మది నాలుగిండ్ల బవంతి. ఎందఱు బంధువులువచ్చినను, ఎందఱభ్యాగతులువచ్చినను షడ్రసోపేతమైన భోజనపు బంతి. నిత్యకల్యాణము పచ్చతోరణముగా విరాజిల్లు నాయింట మాధవశర్మ యొకయతిథివలె నివసించుచున్నాఁడు. అతఁడు నిస్సంగియైన కుటుంబి. పండువయస్సులోనున్న యాతని నెల్లవారు 'జనకుని'వలె భావించి గౌరవింతురు. 'వాల్మీకి' వలెఁ దలంచి పూజింతురు.

మాధవశర్మ యొకనాఁటి ప్రాతఃకాలమున స్నాన సంధ్యాదులు నిర్వర్తించుకొని కూర్చుండెను. అతని నుదుట నేవో యాలోచనా రేఖలు కదలాడుచున్నటులుండెను. ఎన్నఁడును విచారమన్నది యెఱుఁగని యాపండితుఁ డిపు డిట్లుండుటకు హేతువేమైయుండునో! కొంతతడవునకు లోపలినుండి 'నాయనగారూ!' అను పిలుపు శ్రవణమధురముగా వినఁబడినట్లై మాధవశర్మ 'అమ్మా! జానకీ!' యని యాప్యాయముగా సంబోధించెను.

జానకి వచ్చి మాధవశర్మకుఁ బాదవందన మాచరించుటకై దోయిలించి మెల్లఁగా నడుము వంచఁబోయెను. ఆవృద్ధవిప్రునకు మేను జల్లుమని కన్నీళ్ళు గిఱ్ఱునఁ దిరిగెను. వెంటనే "తల్లీ! వలదువలదు. పాదాభివందనమున కిది సమయముకాదు. నిండుచూలాలివై యుంటివి. అదిగాక, నీవంటిసాధ్వి భక్తిభావమును నాయెదుట వెల్లడింపవలయునా? నేను బయివాఁడను గానుగదా! నీవు నాకన్నబిడ్డవు. వడితో బిడ్డను బరికించినపుడే నాకు సంబరము. 'పద్మాక్షి' కరుణాకటాక్షముచే నీ ఘట్టముదాఁటి బయటఁబడినచోఁ గోటలోఁ బాగా వేసినట్లే" యని నిట్టూర్చెను.

జానకి యవసన్నమైన స్వరముతో "నాయనగారూ! కంధారపురమునుండి కబురేమియు రాలేదా? ఆదుష్టుఁడు కటకరాజు ఘోరకార్య మేమిచేసినాఁడో యని భయముగానున్నది. దారుణమైన సంగ్రామాగ్నిలోఁ బ్రాణనా

ధుఁడు కుములుచుండఁగా, నేనిచట విందులుగుడుచుట యేమి! నన్నుఁ గందారపురమునకుఁ బంపివేయుఁడు. కర్మ మెటులున్నదో యటులు జరుగును" అని పలికి యశ్రురుద్ధకంఠయై మాటరాక దుఃఖింపసాఁగెను.

ఒక్క త్రుటికాలము మాధవశర్మ తన హంసహృదయమును జిక్కఁబట్టుకొనలేకపోయెను. వెనువెంటనే ధైర్యము తెచ్చుకొని "అమ్మా! మఱియేమియు భయములేదు. కందారపురమునుండి వార్త తెప్పించెదను. నేఁడో రేపో పురుషు రానై యున్న నీవిట్టు లడలుట యుచితము కాదు. నాఁడు 'బ్రహ్మశిరోనామకాస్త్రము' కీడుఁదొలఁగించి యుత్తరాగర్భముఁ గాపాడిన శ్రీకృష్ణుని యనుగ్రహము నీయందు నిండారుఁ గాక! జానకీ! ఒక్కమాట జ్ఞాపకముంచుకొనుము. గోడకుఁ జెవు లుండునందురు. నాతోఁగాని, మఱియెవ్వరితోఁగాని కందారపురమునుగూర్చి, కటకరాజునుగూర్చి ప్రసంగము తేవలదు. ఎవ్వరు ప్రశ్నించినను 'నా పేరు జానకి యనియు, నాభర్త కాశీయాత్రకు వెళ్ళినారనియుఁ, బుట్టింటికి వచ్చి యున్నాననియే' చెప్పవలయునుసుమా! నేనుండఁగా నీ కేయిబ్బందియు లేదు.'

జానకి యతికష్టముగా నూఱటఁ దెచ్చుకొనెను. మాధవశర్మ యామె పరోక్షమున నిట్టూర్చుచు 'పాపము! ఎట్టిమహారాజ్ఞి కెట్టియవస్థ! ఆంధ్రసామ్రాజ్యాధిపతి పట్టపుదేవి

'సిరియాలు' నాయింట 'జానకి'యై ప్రచ్ఛన్నరూపముతో నుండవలసివచ్చినదా? విధివిలాసము!'

---

౪

కటకరాజు బల్లహుఁడు తనమంత్రిని జూచి ప్రశ్నించెను: 'సోమదేవుని రాణి యెక్కడనున్నదియు జాడ తెలిసినదా?' యని. అమాత్యుఁడు తాను సేకరించిన విషయము రాజుతో నిటులు మనవిచేసెను:

'ప్రభూ! చారులను దేశదేశములకుఁ బంపించితిని. ఇప్పుడే యొకఁడు వచ్చి చెప్పినాఁడు. ఆమె కంధారపురపుఁగోట రాణివాసమునుదాఁటి 'యనుమకొండ' చేరుకొన్నట్లు తెలియుచున్నది. అనుమకొండ బ్రాహ్మణాగ్రహారమున నొక సంపన్నగృహస్థునియింట నొకయిల్లాలు కనఁబడినదఁట. ఆమె యచ్ఛముగా క్షత్రియాంగనవలె నున్నదఁట. నడకతీరులో, మాటలసొగులో రాచఠీవియే గోచరించుచున్నదని చెప్పినాఁడు. యజ్ఞములుచేసిన కర్మిష్ఠిబ్రాహ్మణునియింట క్షత్రియాంగన యెట్లునివసించుచున్నదో తెలియదు. స్వయముగా నేనే వెళ్ళి పరిశీలించవలయునని తలంచుచున్నాను. పిమ్మట దేవరచిత్తము.'

బల్లహుని కన్నులు చింతనిప్పులవలె జేవురించెను. "అనుమకొండయగ్రహారములో 'సిరియాలు'ను దాఁచి మమ్ము

లను మోసగించునట్టి బాఁపఁడుకూడ నుండెనా? వాని కెన్ని గుండెలున్నవి! కందారపురపుఁగోటను ముట్టడించి, సోమదేవుని ప్రాణములు కరవాలమున కైరగావించి వచ్చిన మాతోనా వైరము! కానీ, అనుమకొండయగ్రహారము బుగ్గిచేసి విడిచెదము. గర్భవతియైన రాణిని గాపాడుటకు సోమదేవుని మంత్రి చేసిన కుతంత్రమిది. ఆమె పుత్రుని గనవలయును; ఆపుత్రుఁడు పెరిఁగి పెద్దవాఁడై మాతో యుద్ధముచేయవలయును. చేసి, ఆంధ్రరాజ్యమును బునస్థాపనము చేసికొని కందారపుఁగోటపై తెలుఁగుబావుటా ప్రతిష్ఠింపవలయును! సెబాసు! తెలుఁగు మంత్రి యెంత దూరాలోచనము చేసెను? ఇది దూరాలోచనము కాదు, దురాలోచనము. నీవు తత్‌క్షణమే యనుమకొండకు వెళ్ళి యీవిషయము సమగ్రముగాఁ దెలిసికొని రావలయును. ప్రధానీ! ఆలసించుట మంచిదికాదు. శత్రుశేషము నగ్నిశేషము నుపేక్షింపరా' దని కటకరాజు గర్జించెను.

నాఁడే కొంతసైన్యమును వెంటనిడుకొని కటకమంత్రి 'యనుమకొండ'కుఁ బ్రయాణించెను. కటకమంత్రి వచ్చిన సంగతి మాధవశర్మ విని యనుమానించి భారము భగవంతునిపైనుంచి ధీరుఁడై యుండెను. సైనికుల నూరి వెలుపల నుండ నియమించి యొక విప్రుని వెంటఁబెట్టుకొని యమాత్యుఁడు చిన్నగా నగ్రహారమున కరిగెను. అగ్రహారములోఁ బెద్దవాఁడు మాధవశర్మ యని చెప్పఁగా విని యతనియింటికే వెళ్ళెను.

కటకమంత్రి తనయింటికి వచ్చునప్పటికి వృద్ధమాధవశర్మ మనుమలకుఁ బారము చెప్పుచుండెను. వారిలో నొక పిల్లవాఁడు తాతగారి నేదో ప్రశ్నించుచున్నాఁడు. వాని కాతేండ్లకు లోఁబడినయీాఁడు. ఉజ్జ్వలములైన కన్నులు. ధీరమధురమైన శబ్దోచ్చారణము.

'తాతగారూ! శ్రీరాముఁడు సీత నరణ్యములో దిగవిడిచిరమ్మని లక్ష్మణున కాజ్ఞాపించెనుగదా! పాపము! ఒంటరిగా నామె యడవిలో నెంత పరితపించినదో! వాల్మీకిమహర్షి కనఁబడనిచో నామె యేమికావలసినది!'

మనుమని ప్రశ్నకుఁ దాతగారు ప్రత్యుత్తరముగా 'ఉత్తమచరిత్రలకు భగవంతుఁ డేదోవిధముగాఁ దోడ్పడుచునే యుండు'నని పలికెను.

కటకరాజమంత్రి మాధవశర్మకు నమస్కరించి కూర్చుండెను. ప్రక్కనున్న విప్రుఁడు మాధవశర్మకు, బల్లహామంత్రికి నన్యోన్యపరిచయము నెఱపెను. మంత్రి యోగక్షేమాదు లడిగినవెంట వారి కిట్లు సంభాషణము జరిగెను;

శర్మ:— తమరు మాపల్లెకు దయచేసిన కారణము!

మంత్రి:— మఱేమియులేదు. మా ప్రభువు బల్లహుఁడు కందారరాజ్యము నాక్రమించుకొనె నని, బల్లహుని వాఁడికరవాలమున కాంధ్రరాజు సోమదేవుఁడు గుఱియయ్యె నని మీారు వినియే యుండవచ్చును.

శర్మ:— వినకేమి! అది కొన్ని యేండ్ల క్రిందటనే జరిగిన ముచ్చటగదా!

మంత్రి:— కందారపురంగోట ముట్టడించు సమయమున సోమదేవుని రాణియగు 'సిరియాలుదేవి' రహస్యముగా నెక్కడికో కొంపోవంబడినది. ఆమె యెక్కడ నున్నదో తెలియక యిన్నాళ్ళనుండి జాడలు తీయుచున్నాము. శత్రుశేషముండరాదని మాప్రభువువారి శాసనము.

శర్మ:— అవును. రాజనీతి రీతి యట్టిదేకదా!

మంత్రి:— మొన్ననే మాకొక వార్త తెలిసినది. ఆమె యీ యనుమకొండ యగ్రహారములో నొక విప్రునియింట సంరక్షింపంబడుచు నజ్ఞాతవాసము చేయుచున్నదంట. ఈ విషయము వృద్ధులైన మీకేమేని తెలిసియున్నదేమో యెఱుంగుటకు వచ్చియున్నాను.

శర్మ:— క్షత్రియాంగన విప్రునియింట నుంటయా? మంత్రిగారొక క్రొత్తవింత చెప్పినవారైరి. పాపము! కందారపురాజ్ఞి కిట్టియవస్థ వచ్చినదా? ఆమె యెక్కడ నున్నదో నాకేమియుం దెలియదు. పదియిండ్ల యగ్రహారము. ఇక్కడ నెవరియింటనైన నున్నచో నాకుం దెలియకుండంగా నెటు లుండును!

మంత్రి:— అయ్యా! దాంచనేల! సిరియాలుదేవి తమయింటనే యుండి సంరక్షింపం బడుచున్నదనియు మాకుం జూచా

యగాఁ దెలిసినది. బల్లహుఁడు సాధారణుఁడు కాఁడు.
ఈవిషయము విన్నప్పటినుండియు ననుమక్కొండను భస్మ
ముచేయుదు నని యాప్రభువు మండిపడు చున్నాఁడు.
అయినను, తొందరపడుట భావ్యము కాదని స్వయ
ముగా యథార్థము సేకరించుటకు నేనే రావలసి వచ్చి
నది. ఒక వేళ, ఆమె మీా యొద్దికలో నున్నచోఁ
దెలుపుఁడు. మఱేమియు నిబ్బంది రాదు.

శర్మ:— చిత్రముగా నున్నదే! పండిపోయిన వయస్సులోనుండి
దైవధ్యానముతోఁ గాలక్షేపము చేసికొనుచున్న నా
మీాఁదనా యీా యభాండము! కందారరాజు రాణి
వాస మెక్కడ? నాయింట వసించుట యెక్కడ? కల్పన
మైనను యుక్తియుక్తముగా నుండవలయును. మీా రె
వరి వలన వింటిరో కాని యిందణుమాత్రము సత్యము
లేదు.

మంత్రి:— సత్యములేదా? మా ప్రభువుల శాసనముచే మీా
యిల్లు 'సోదా' చేయవలసియున్నది. ఏమందురు?

శర్మ:— అభ్యంతరము లేదు.

మంత్రికి మాధవశర్మకు జరుగుచున్న యీా సంభాషణ
మింటనున్న 'జానకి' వినుచున్నది. ఆ జేండ్లకుఁ బూర్వ మొక
నడిరేయి వేళ కందారదుర్గము విడిచి, యడవిత్రోవలో దాసీ
ద్వితీయమై ప్రయాణించునప్పటి హృదయాందోళనానుభూతి
సిరియాలు దేవి కానాఁడు మఱలఁ గలిగెను.

౫

సువిశాలసుందరమైన పద్మాక్షీ దేవతాలయముఖమండ పముస ననుమకొండ యగ్రహారములోని బ్రాహ్మణబృంద మంతయు ద్వాదశినాఁడు తెల్లవాఱి యనుష్ఠానము పూర్తి యైన పిదప సమావిష్ట మయ్యెను. కటకరాజమంత్రి, బల్లహుని యాదేశప్రకారము విప్రులకు భోజనసంతర్పణ మేర్పాటు చేయించెను. అనుమకొండ యగ్రహారస్థులేగాక చుట్టుపట్టు గ్రామములనుండి మఱికొందఱు భూసురులును భోజనార్థ మాహ్వానింపఁబడి వచ్చిరి.

వంట లయినవి. మడులు గట్టుకొని బ్రాహ్మణులు సపాత్రులై విచ్చేసిరి. పద్మాక్షీ దేవతాలయ ప్రాంగణము స్వస్తివాచనములతోఁ బ్రతిధ్వనించుచున్నది. స్వస్త్యనంతరము, కటకమంత్రి లేచి బ్రాహ్మణ బృందమునకు నమస్కరించి యిట్లు పలికెను:

"భూసురోత్తములారా! మాప్రభువు బల్లహుఁడు చేసిన యాదేశముతో మిమ్ముల నిచ్చట సమారాధనమున కాహ్వానించినాము. దయచేసిన మీకెల్లరకుఁ గృతజ్ఞులము. ఈ సమావేశమున కొక హేతువున్నది. ఈ యనుమకొండ యగ్రహారములో విద్యావయోవృద్ధుఁడైన మాధవశర్మయింట "జానకి" యను పేరుగల యామె యున్నది. ఆమె, కందారపురాధిపతియై కొన్నివత్సరముల క్రిందట మాప్రభువుచే నిహ

త్రుఁడైన సోమదేవునకుఁ బట్టపురాణి యగు "సిరియాలు దేవి" యని మా సందేహము. మాధవశర్మ "జానకి నా కన్న కూఁతురు. మా యల్లుఁడు కాశికి వెళ్ళుచుఁ గొన్నాళ్ళు పుట్టింట నీమె నుంచినాఁడు" అని చెప్పుచున్నాఁడు. 'జానకి' రూప సౌష్ఠవాదులు, మాటతీరు పట్టిచూచినచో క్షత్రి యాంగనవలె స్పష్టముగా గోచరించుచున్నది. అదిగాక, ఆమె బిడ్డ బాలమాధవుఁ డనువాఁ డాఱేండ్ల వయస్సువాఁడు. కందారపుఁగోట ముట్టడి జరిగియిప్పటి కించుమించుగా నాఱేండ్ల కాలమైనది. ఆముట్టడినాఁటికి "సిరియాలు దేవి" పూర్ణ గర్భిణియని విన్నాము. బాలమాధవుని ముఖములోఁ, గన్ను లలో క్షాత్త్రతేజము సువ్యక్తమగుచున్నది.

ఇన్ని ప్రత్యక్షప్రమాణములచే 'జానకి' "సిరియాలు దేవి" యని నిర్ధారిత మగుచున్నను మాధవశర్మ కాదనుచుం డెను. ఈవిషయము నిర్ణయించుకొనుటకు మా కటక ప్రభు వీ బ్రాహ్మణ సమారాధనము నేర్పాటు చేయించెను. 'జానకి' బ్రాహ్మణియైనచో నామె వడ్డనము చేయఁగా భోజనము చేయుటకు మీ కేయభ్యంతరము నుండదు కదా! కావున, నేఁటి సంతర్పణమున నామె మీకు వడ్డనచేయును. మీరు భుజింపవలయును. ఆహితాగ్నులు, కర్మిష్ఠులు, నామ్నాయ నైష్ఠికులు నగు మీవంటి విప్రోత్తములు క్షత్త్రియాంగనచేతి యన్నము భుజింతురా? ఇంతకంటె, 'జానకి' బ్రాహ్మణ స్త్రీ యని నిర్ధారించుకొనుటకుఁ దగిన సాధనము కనిపించుటలేదు".

నాఁటి సమారాధనమునకు విచ్చేసిన యనుమకొండ యగ్రహారస్థుల కందఱకు 'జానకి' నిజవృత్తాంతము తెలియును. ఆమె 'సిరియాలుదేవి' యనియు, క్షత్రియాంగన యనియు, కందారపురాధిపతి పట్టపురాణియనియు వారందఱు నెఱుఁగుదురు. ఒకచిత్రమేమనఁగా, ఆ విప్రసంఘములోని కట్టుబాటు వలన మాధవశర్మ యెంతచెప్పిన నంతజరుగును. అతఁడు సర్వవిషయములలోను గ్రామస్థుల కొక యారాధ్య దైవము. ఆవృద్ధుఁడు ధర్మసూక్ష్మము లెఱిఁగిన లోకజ్ఞుఁడు. మాధవశర్మ "యగ్నిలో నుఱుకుఁ" డనుచో వారందఱు సంసిద్ధులు. వారిలో ననేకత్వము లేదు. నేఁడు 'విప్ర సంతర్పణము' జరుగు ననఁగాఁ దొలినాఁడురాత్రి మాధవశర్మ రహస్యముగా నొక సమావేశ మేర్పాటుచేసి వారి కిట్లు బోధించెను:

"మిత్రులారా! అగ్నిపరీక్ష వచ్చినది. వర్ణధర్మ సంరక్షణము - దేశసంరక్షణము - ఈ రెంటిలో దేనికిఁ బ్రాధాన్యమీయవలెనన్నది గడ్డుసమస్య. వర్ణాశ్రమధర్మసంరక్షకుఁడగు క్షత్రియ ప్రభువు సోమదేవుఁడు కటకరాజుచేతిలో నసువులు గోల్పోయెను. కందారపుఁగోట పరాక్రాంతమైనది. ఆంధ్రదేశమున నుత్కలరాజపరిపాలనము తలసూపినది. మనయాచారధర్మములు, మన కర్మానుష్ఠానము వెనుకటివలె సాగుననుటకు వీలులేదు. శ్రుతిస్మృతిపురాణములమీఁదఁ గటకరాజునకు భక్తి విశ్వాసములు లేవు. అట్టి నాస్తికుని యేలుబడిలో మన దేశమెట్టి దుస్థితికి రానైయున్నదో యోచింపుఁడు. మనము

జానకిచేతియన్నము తిన్నచో నామె బ్రాహ్మణియని విశ్వ
సించి కటకమంత్రి చక్కఁబోవును. బల్లహుని సందేహము
తొలఁగిపోవును.

అట్లు కానినాఁడు, దుష్టుఁడైన బల్లహుఁడు మనలను
బ్రతుకనీయఁడు. ససైన్యుఁడై వచ్చి యనుకొన్న యంతయుఁ
గబళింపఁగలఁడు. తెలుఁగు దేశమున నుత్తర జనపదపాలనము
సాగుటయే గొప్పయున్నాగా మనము భావింపవలెను. ఆపైన
నేదో విధముగా మడిగియుంచఁజేయుట కర్తవ్యము. "బాలమా
ధవుఁడు" వర్ధమానపురమునందు నిపుణాభివృద్ధి నందుచు
న్నాఁడు. మఱి నాలుగు [illegible] కంచా
రరాజ్యమును దిరిగి [illegible] చేయఁ
గలవాఁడగును. [illegible]
[illegible]. ఇట్టి
యాలోచించి [illegible] కాంక్షించి [illegible]
ర్హముగా '[illegible]' [illegible]
పవలసియున్నది. [illegible]
హెచ్చుగాఁ [illegible]
మున జరుగు [illegible]
ధర్మసంరక్షణోద్యోగముగా భావింపవలెనని నా విశ్వాసము."

నిన్నరాత్రి వర్ధమానపురము [illegible] విన్న యా దివ్య
బోధ యాగ్రహారికుల చెవులలో గింగురుమనుచున్నది. కటక
మంత్రి నేఁడు పలికిన మాటలు విని విప్రసంఘమంతయు

సర్వాంగీకారమును వెలిఁబుచ్చెను. 'జానకి' చేతియన్నము భుజించుట కెవ్వరికి నభ్యంతరము లేదు.

బ్రాహ్మణులెల్ల వృద్ధమాధవశర్మను ముందిడుకొని బంతి సాగించిరి. అరఁటియాకులు పఱచి, పరిశుభ్రముగాఁ దుడిచి, యభిఘరించి వడ్డన కుపక్రమించిరి. వంటవాఁడు పదార్థములు సమృద్ధిగా నాకులలో వడ్డించిరి. 'విశాలాక్షి'వలె జానకి బంతినడుమకు వచ్చి తానుగూడఁ గొన్ని వంటకములు, పచ్చడులు, నూరుఁగాయలు, నుక్కెరలు, చక్కెరలు, వడియములుఁ, గడియములు, నప్పడములు, పప్పులు వడ్డనచేసెను. వడ్డనయెల్ల ముగిసినతరువాతఁ బునరభిఘారము చేయఁబడెను. విప్రులు నివేదనములు చేసికొని భోజనముల కుపక్రమించిరి. "జానకి" బంతి బంతి నడుమకు వచ్చి నడుమనడుమఁ దాకొన్నంతము వీచుచుండెను. నేయి వడ్డించుచుండెను. మంచితీర్థము పోయుచుండెను. పళ్ళెరములతో భక్ష్యములు తెచ్చి వడ్డన నెఱపుచుండెను.

చతుర్విధాహారములతో సంతృప్తముగా విప్రభోజనములు ముగిసినవి. బల్లహరాజు సంస్థానమునకు సంబంధించిన యొక భూసురోత్తముఁ డాదృశ్యమంతయు సాంతముగాఁ బరికించినాఁడు. 'జానకి' క్షత్రియాంగన కాదని యతఁడు నిర్ణయించుకొనెను. అక్కడ భోజనపుబంతి తీర్చిన వారెల్లరు సదాచార పరులైన నైష్ఠికులు. వారిలోఁగొందఱు సోమయాజులు. మఱి, 'జానకి' బ్రాహ్మణస్త్రీ కానిచో వర్ణధర్మమును

గాదని వారామె వద్దన కంగీకరింపరుకదా ! ఇది యతని నిశ్చ యము. ఆ నిశ్చయమునే మంత్రికి, కటకరాజు బల్లహునకు నాభూసురుఁ డెఱింగించెను. 'సిరియాలుదేవి' పతిమరణ వార్త విని మరణించి యుండవచ్చునని వారు సరిపెట్టుకొనిరి.

---

## ౬

'జానకి' యను నజ్ఞాతనామముతోఁ బ్రచ్ఛన్నయై మాధవశర్మ యింటనున్న 'సిరియాలుదేవి' కన్నకొడుకునకు 'మాధవవర్మ' యనుపేరు పెట్టుకొన్నది. ఆపత్సమయమునఁ దన్నుఁ గాపాడి, పురుడుపోసి, బిడ్డను బెంచుచున్న యా వృద్ధ విప్రునియెడలఁ గృతజ్ఞతయెట్లు తెలుపవలయునో యా రాణి కెఱుఁగరాకున్నది.

బాలమాధవవర్మ వృద్ధమాధవశర్మ సన్నిధి నక్షర స్వీకారముచేసి పదునాఱేండ్లు వచ్చుసరికి సకలవిద్యలు నభ్య సించెను. ఇందాఁక, మాధవవర్మ దృష్టిలో 'మాధవశర్మ'కు మాతామహస్థానము. ఇప్పుడో ! గురుస్థానము. క్షత్రియోచి తముగా జాతకర్మాది సంస్కారములు, నుపనయనము మాధవ వర్మకు జరుపఁబడెను.

తాతగారు దగ్గఱఁ గూర్చుండఁబెట్టుకొని 'వర్మ'కు శాస్త్రరహస్యములు, ధర్మరీతులు, దండనీతులు, రాజ్యతంత్ర

ములు, వ్యూహనిర్మాణములు నూఱిపోసెను. తల్లి, సిరియాలు పదియేండ్లవయస్సు వచ్చునప్పటికిఁ గుమారునకు భారత భాగవత రామాయణములలోని కథా తత్త్వము స్వాయముగా బోధించెను.

కుసుమ సౌరభము మునుఁగు నెట్టినను దాఁగునది కాదు. పసినాఁటినుండియు బాలమాధవవర్మ క్షాత్ర విక్రమమును ప్రదర్శించు నాటలే యాడుచుండును. అట్టి పాటలే పాడుచుండును. అట్టి మాటలే పలుకుచుండును.

తడిమన్నుతోఁ గోటగోడలు కట్టి, తోడివారినక్కడ నిలఁబెట్టి, వారితోఁ బోరాటము సలుపుచును నానందించుచున్నప్పుడు సిరియాలుదేవి మాతృవాత్సల్య ముప్పొంగి మురిసిపోవును. కుమారుని వీరోచితమైన నడకలలో, గంభీరమైన చూపులలో, విశాల భాసురమైన వక్షస్థలములలో నతని తండ్రి మూర్తి కన్నులకుఁ గట్టినట్లై సిరియాలు దుఃఖితయగుచుండును. ఆమె తన కన్నులతడి యెన్నఁడును మాతృవత్సలునకుఁ గనఁబడ నీయలేదు.

సవయస్కులు తమతండ్రులను బిలుచుపిలుపువిని బాలమాధవుఁడు తల్లినిగని 'అమ్మా! చెప్పవే మా నాన్నగారెవరే? ఎక్కడనున్నారు?' అని ప్రశ్నించుచుండెడివాఁడు. ఆ తల్లి మాయమాటలు చెప్పి కుమారుని తలఁపు మఱపించి పరోక్షమున దుఃఖించుచుండెడిది.

పదేండ్లు దాఁటి యుపనయన మయినతరువాత నా రాచ
బిడ్డ యెట్లు తెలిసికొనెనో, తానొక రాజపుత్త్రుఁడనని తన
తండ్రి మరణించెనని, తల్లి యజ్ఞాతవాసము చేయుచున్నదని
కనిపట్టఁగలిగెను. వృద్ధమాధవశర్మ యప్పుడప్పుడు తనతల్లితో
మాటాడుచున్న మాటలనుబట్టి, తోడివారిలోఁ గొందఱాడు
కొను గుసగుసలనుబట్టి తనచరిత్ర కొంత తెలిసికొనియుండు
ననుటలో సందేహములేదు. దండనీతి, రాజ్యతంత్రము, ఆయ
వ్యయముల లెక్కలు, అస్త్రవిద్యలో మెలఁకువలు, అథర్వ
వేదములోని కొన్ని రహస్యములు, ప్రజారంజన పద్ధతులు,
ఇత్యాదులనుగూర్చి వృద్ధమాధవశర్మ తనకు బోధించుచున్న
పుడే మాధవునకుఁ దాను రాచబిడ్డఁడనను నిశ్చయము కలిగెను.
చిన్ననాఁటఁ దా నెన్ని ప్రశ్నలు వేసినను నిజవృత్తాంతము తల్లి
గాని, మాధవశర్మగాని చెప్పరైరి.

కుశాగ్రబుద్ధియగు మాధవుఁడు పదునాఱేండ్లు వచ్చు
సరికి నావులించినఁ బ్రేవులు లెక్కించువాఁడై స్వవిషయము
చాలభాగము గ్రహింపఁగలిగెను. వృద్ధమాధవశర్మ తరుణము
గుఱుతించి యొకనాఁడు మాధవుని గూర్చుండఁబెట్టి సావధాన
ముగా నీవిధమునఁ జెప్పెను:

'బిడ్డా! మాధవా! ఇన్నాళ్లవఱకు నొకవిషయము
నీదగ్గఱ దాఁచియుంచితిని. అదియిఁక దాఁగుటలేదు. దాఁచు
కొనుటయు భావ్యముకాదు. ఆంధ్రరాజధానియగు కందార
పురమును రాచవీడుగాఁ జేసికొని రాజ్యపాలనము నెఱపిన

సోమదేవ భూపాలుఁడు నీతండ్రి. పాపము, నీ వెన్నిసారులు ప్రశ్నించినను నీతల్లి కాని, నేనుగాని నీ'తండ్రి' యెవరో చెప్ప మైతిమి. నిరంతరగోసేవావ్రతముచేఁ బవిత్రుఁడై, నిత్య భగవత్పూజలచేఁ బరిపూతుఁడై 'సిరియాలుదేవి' పట్టమహిషి యందు నిన్నుఁగన్నాఁడు. కటకరాజగు బల్లహుఁడనుదుష్టుఁడు కందారపుఁగోఁట నాకస్మికముగా ముట్టడించి వీరశిరోమణియగు నీ తండ్రిని మడియింపఁజేసినాఁడు. ఇప్పుడు తెలుఁగుకోటపై కటకరాజు పతాక మెగురుచున్నది. సోమదేవ భూపాలుని మంత్రి, నీతల్లియగు సిరియాలుదేవిని దుర్గమునుండి పరులెరయకుండ నాఁటి యర్ధరాత్రమున నీ యనుమకొండకుఁ బంపించివేసెను. నాఁటికి నీతల్లి గర్భవతియై యున్నది. నే నామె నింటఁ బెట్టుకొని కన్నకూఁతురువోలెఁ బరికించుచుఁ బురుడు పోయించితిని. ఆమె గర్భమున నీవు జన్మించితివి. తరువాతికథ చెప్ప నక్కఱలేదు.

జానకి యను మారుపేరితో నాయింటనున్న నీతల్లి తెలుఁగుదేశపు మహారాజ్ఞి. ఆమెయవస్థ యిటుపట్టినది. ఆమె నీమీఁద గంపెఁడాసపెట్టుకొని యెట్టులో గుట్టుగాఁ గాలము గడుపుచున్నది. నీవు యువకుఁడవై తివి. నీ మేధావిశేషము వలన సకలవిద్యలు తెలిసికొంటివి. ఈసందర్భమున నాగురుత్వ మొక నిమిత్తమాత్రము. శతవృద్ధుఁడనైన నేనొక్క యమృత వార్త విని తనువు చాలించవలసియున్నది. నీతండ్రియగు సోమదేవుని సంహారించిన బల్లహుని కంఠము నుత్తరింపవల

యును. నీవు పైతృకమైన యాంధ్రరాజ్యసింహాపీఠము నధిష్ఠింపవలయును. ఇదే నాయభీష్టము."

మాధవశర్మ చెప్పుచున్న మాటలు ధీరనిశ్చలవిస్ఫారితనయనములతో నాలించి బాలమాధవుఁడు నిశ్చేష్టుఁడయ్యెను. చాలభాగము ధైర్యముతో వినఁ గలిగెను గాని చివరికిఁక దుఃఖ మాఁపుకొనలేక పసిపిల్లవానివలె వెక్కి వెక్కి యేడువసాఁగెను. తనతండ్రి నిర్యాణముకంటె మాతృదేవి యజ్ఞాతస్థితిలోఁ బరాశ్రయణమున నుంకుట యాతనికి మఱియు శోకకారణమయ్యెను. మాధవశర్మకు వెనువెంటనే యేమియుఁ బ్రత్యుత్తర మీయలేకపోయెను. తన తల్లిని దర్శించినఁగాని యతని దుఃఖోద్వేగ మాఁగునట్లులేదు. అతఁడు సిరియాలుకడకు బాష్పప్లుతలోచనములతో వెళ్ళి సాష్టాంగపడెను. కన్నీళ్ళతో సిరియాలు కుమారుని శిరము నార్ద్రముచేసి లేవనెత్తి "నాయనా! ఏమి యీ యుత్తలపాటు!" అని యడిగెను.

మాధవవర్మ డగ్గుత్తికతో "అమ్మా! యిప్పటివఱకు నాకుఁ జెప్పవైతివి. కటక రాజుబల్లవుఁడు నాతండ్రిని సంహరించి, కందారదుర్గ మాక్రమించుకొనెనఁటకదా! ఇప్పుడే తాతగారు చెప్పినారు. తల్లీ! దాసీజనసహస్రపరివృతవై యంతఃపురములో సంచరించిన నీకా యిట్టి దుర్దశ! ఈయవస్థయంతయు నామూలమునఁగదా నీకుఁ దటస్థించినది! గర్భస్థుఁడనైయున్న నన్నుఁ గాపాడుకొనుట కెన్ని యాపదలు పాలు

పడితివో! కష్టపడి కనిపెంచిన నీ ఋణమునెట్లుతీర్చుకొందును!' అని వాపోవసాగెను.

సిరియాలు చేలచెఱఁగున బిడ్డకందోయి నొత్తి "నాయనా! నీవు తీర్పవలసినది తల్లి ఋణముకాదు. నీకై తపించి తపించి కనులార నీమూర్తిని గాంచనోఁచుకొనక కదన రంగమునఁ బ్రాణములు వీడిన తండ్రిగారి యప్పుదీర్చుకొనుటకు యత్నింపుము. అనవలంబయై యత్యంతకష్టస్థితిలో నల్లాడు నీ తల్లిని కరుణాధురీణుఁడై కాపాడి పురుడుపోయించి పెంచుచున్న మాధవశర్మ యప్పుదీర్చుకొనుటకు యత్నిం పుము. నీతండ్రిని మడియించి కందారదుర్గ మాక్రమించు కొన్న దుష్టబల్లహునిఁ బొలియించి యాంధ్రరాజ్య పునస్థా పనము చేయుట తప్ప పితృ — గురుఋణములు తీర్చుకొను టకు వేఱొక దారిలేదు.

సర్వమునకును మాధవుఁడున్నాఁడు. 'పద్మాక్షీ దేవి' యున్నది. పద్మాక్షీ కరుణాశీర్వాదముతో, మాధవశర్మ మార్గదర్శిత్వముతోఁ గార్యసాధనమునకుఁ గడంగుము. కందా రపురదుర్గాగ్రమునఁ దెనుఁగుజెండా యెగురుచుండఁగాఁ, జైత్ర కమైన స్వర్ణపీఠమున నీవు తీర్చియుండగాఁ గనులారఁగాంచి యింతదాఁకఁబడిన దుఃఖము విస్మరించెదను. అంతకుమించి నాకు వలసినది లేదు."

మాతృదేవి యుపదేశము నాదేశముగా భావించి మాధవుఁడు దోయిలించి "అమ్మా! తాతగారి యాశీర్వాద

బలముచే, నుపదేశమహిమచే నచిరకాలములో నీయభీష్టము నెఱవేర్చి ధన్యుఁడనగుదు" నని పలికెను. సిరియాలు పరమానందభరితహృదయముతోఁ గుమారుని శిరము మూర్కొని విజయోదర్కముగా దీవించెను.

---

## ౭

రాత్రియొక్క తుత్రికైనను మాధవవర్మకుఁ గంటిపైఁ గునుకులేదు. అతఁడు కందారదుర్గము నాక్రమించుకొనుటలో నుపాయములు నపాయములు, సాధకములు బాధకములు యోచించుటకు మొదలుపెట్టెను. త్రాడును బొంగరములేని తన బలముతో నొకబలవద్విరోధిని బ్రతిఘటించుట! సైన్యము లేదు; ధనములేదు; ఆయుధాదికములులేవు. ఏమియు లేదు. మాధవవర్మ కున్నది బాహుశక్తియొకటి; దేశభక్తియొకటి, ఈ రెండే. వృద్ధమాధవశర్మ యుపదేశోక్తి యీరెండింటికి మెఱుఁగు తెచ్చినది.

మాధవవర్మ కనుమకొండలోఁ బ్రాణమిచ్చు మిత్రవర్గము మాత్రమున్నది. ఆ మిత్రుల సాయముతో దండయాత్ర సాగించుటయా? దుస్సాధమైన కార్యము తలపైఁ బెట్టుకొన్న మాధవునకుఁ గుదురుండకపోవుటలో నాశ్చర్యములేదు.

ఎట్లో తెల్లవాఱినది. ఆ బాలవీరుఁడు మాధవశర్మ సన్నిధిని గూరుచుండి "తాతగారూ! ఇంతదనుక వ్యర్థముగాఁ గాలము గడచిపోయినది. బల్లహుని సంహరించికాని యిఁక నిద్రింప లేను. తమ యాశీర్వచనముతో ఖడ్గపాణినై వెళ్ళఁదలఁచు కొన్నా" నని పలికెను.

వృద్ధవిప్రున కామాట యుత్సాహ కారణమయ్యెను. అతఁడు 'సరే' యన్నచో బాలమాధవుఁడు వెళ్ళి బల్లహుని మీఁదఁ బడును. ఆక్షణమున నా రాచబిడ్డ సాహసోద్రేకము లట్టివి! దీర్ఘదర్శి రాజ్యతంత్రకోవిదుఁడునగు నావృద్ధమూర్తి మాధవవర్మ యుద్రిక్తహృదయమును శాంతపఱుచుచు నిటు లుపదేశించెను:

"బిడ్డా! సిరియాలు నిజముగా వీరమాత. జన్మాంతర సుకృతము కారణముగా నిన్ను నాయింటఁ బెంచునట్టి యదృష్టము కలిగినది. నీయెడల నా గురుత్వము నేఁడు చరితార్థమైనది. మాతృఋణము దీర్చుకొనుటకు యత్నించు నీయుద్యమము సఫలమగుఁగాక! రాజకీయరహస్యములు నీవెఱింగియుంటివి. ప్రబలుఁడైన పగవాని నెదుర్కొనునప్పు డెంతో మెలఁకువయుండవలయును. వేళ్ళుపాఱియున్న చెట్టును బుజము వెట్టి పెల్లగించుట సుకరమైన పనికాదు. తఱియరసి దండెత్తవలెనుగాని తొందరపడి మరులతోఁ బోరాటమునకు సిద్ధపడుట చేటుదెచ్చునుసుమీ! నీవు బాహుశక్తిసంపన్నుఁడవైనను, పరాక్రమవంతుఁడవైనను వయోనుభవములు తక్కువ

గలవాఁడవు. బలము - ధనము సేకరించుకొని తరుణము గుర్తించి విజయముసాధింపుము.

నాకుఁ దోఁచిన మార్గమొకటి చూపుచున్నాను. ఎటు లుండునో యోచింపుము. అనుమకొండ 'ఎఱుక దేవరాజు' పరి పాలనములో నున్నది. అతఁడు చిఱుతఱేఁడు. అల్పమైన సైన్యము కలవాఁడు. ఆతని దుర్గము సులభముగా నాక్రమింపఁదగియుండును. 'ఇంట గెలిచి రచ్చ గెలువు' మన్నట్లు తొలుత నా యెఱుకఱేని పనిపట్టి వాని సైన్యధనములు స్వాధీనము చేసికొని భావిరాజ్య కల్యాణసౌధమునకుఁ దోరణ ముగా ననుమకొండ నాక్రమింపుము. తరువాత, కందారదుర్గా క్రమణము నల్లేరుపై బండినడక.'

జ్ఞానవయోవృద్ధుఁడైన మాధవశర్మ యుపాయోపదేశ ములు విని బాలమాధవుఁ డుప్పొంగి యెగిరిగంతువైచెను. వయస్సుగడచి యనుభవము సంపాదించిన పెద్దలవలని యుప యోగమెట్టిదో యిప్పుడతని కర్థమయ్యెను. తెల్లవారు దాఁక బుఱ్ఱకొట్టుకొని యాలోచించినను దేలనిసమస్య నొక యర నిముసములో నాయన తేల్చి చెప్పఁగలిగెను. మాధవవర్మకుఁ గొంద ఱుత్సాహవంతులైన యువకులు తోడు నీడలై యున్నారు. వా రందఱు పనివచ్చినచో ననిలోఁదూకి విక్రమ ప్రకటనము చేయఁగలవారు. వారి సాయముతోఁ దన బాహు స్ఫురణముతోఁ దొలుత 'నెఱుక దేవరాజు' చిఱుదుర్గము ముట్ట డించుటకు ముహూర్త నిర్ణయముచేసెను. ఎఱుకరాజు సైనిక

బలసంగ్రహణముకంటె ధన సంగ్రహణము హెచ్చుగాఁ గావించినవాఁడు.

మాధవవర్మ మిత్రవీరుల తోడుపాటుతో నొకనాఁ డెఱుకతేనిపై సంగరమునకు బయలు దేఱెను. ఉడుకుర క్తపు బలముతో, యువత్వములోనున్న యుత్సాహముతో, 'నేను, నే'నని బాలవీరులందఱు, మాధవవర్మను ముందిడికొని ప్రస్థానము సాగించుచుండఁగా ననుమకొండ ప్రజావళి యాశ్చర్యముతోఁ జూచుచుండెను. అలవోకగా నాటకుఁ బోయినట్లు బోవుచుండిరి కాని పోరాటమునకుఁ బోవుచున్నట్లులేదని గ్రామస్థులు నివ్వెఱ పడసాగిరి.

మాధవుని నాయకత్వముతో జాతీయ యువసైనికు లెఱుకతేని దుర్గమును ముట్టడించిరి. ఆకస్మికముగా వచ్చిన యీ ముట్టడిరహస్యము యారాజున కర్థముకాలేదు. కొంత సేపు తనకుఁగల యల్పసైన్యము సాహాయ్యముతో నెఱుక తేఁడు పోరుసల్పెను గాని మాధవవర్మ విక్రమముముందు నాతఁడు నిలఁబడలేక పరాజితుఁడై మైత్రినర్థించెను. మాధవ వర్మ యెఱుకతేనికిఁ దన భావికార్యక్రమ మెఱిఁగించి . యతని తోడ్పాటు కావలయునని కోరెను. ఆతఁడు సైన్య ధన సాహాయ్యము చేయుట కొడంబడెను. దానితో, మాధవవర్మ ముందరి యుద్యమమునకు 'నాంది' జరిగినది.

## ౮

అనుమకొండలోఁ బద్మాక్షీ దేవతాలయము. ఆలయ ప్రాంగణమున సిరియాలు దేవి; ఆమెప్రక్క బాలమాధవవర్మ. సిరియాలు పద్మాక్షి సమక్షమునఁ గేలుగవ మొగిచి, తన కుమారుని పక్షముగా నిట్లు ప్రార్థించెను:

'ఓ దయామయీ! పద్మాక్షీ! ఈ బాలభక్తుఁడు మాధవుఁడు నీ కటాక్షమునకై దోయిలి పట్టియున్నాఁడు. అజ్ఞాత యోగములోనున్న యీ నా యాత్మజునిపై కృపామృతము గురిపించి పార్థుని గాపాడినట్లు కాపాడుము. పరరాజుల యేలుబడితో నలమటించుచున్న తెలుఁగు రాజ్యమును స్వాధీనముచేసికొని తనతండ్రిపేరు పెంపులు నిలఁబెట్టుటకు యత్నించు నీకుఱ్ఱనిపై దయనెఱపుము. జగములెల్ల నూఁగింతునను వెఱ్ఱిసాహస మొకటితప్ప యుద్ధరంగములచొప్పు నెఱుఁగనివాఁడు. నాకేదో కొండంతయాస కల్పించి కదనమున కరుగుచున్నాఁడు; పైబరువెల్ల నీదే తల్లీ! తండ్రిలేని యేకైక పుత్రికుఁడు వీఁడు. లేడిపరువుతో నరుగఁజూచుచున్నాఁడు కాని, శాత్రవసింహములకు భయపడుటలేదు. స్వారాజ్య పునస్థాపనమున దీక్షితుఁడై పోవుచున్న యీ చిరంజీవినిఁ గరుణించి నీ కృపావజ్ర కవచము, నీ కటాక్షమండలము కానుకగా నిచ్చి యాశీర్వదింపుము.'

తల్లి ప్రార్థనా నంతరము మాధవవర్మ పద్మాక్షికి భక్తి భావముతో మువ్మాఱు మ్రొక్కి మౌనధ్యానము గావించెను. ముద్దుబిడ్డ నొసటిపై కుంకుమతిలకము దిద్ది సిరియాలు 'విజయోఽస్తు !' అని దీవించెను.

వృద్ధమాధవశర్మ నిర్ణయించిన ముహూర్తమున మాధవవర్మ తన సంగడికాండ్రగు జోదులతో, నెఱుక దేవుం దఱిని పడసిన రాణువతోఁ గందారపురదుర్గము నాక్రమించి యాంధ్ర సామ్రాజ్య పునస్థాపనమునకు బయలుదేఱెను. ఆతని ప్రస్థాన సమయమున ననుముకొండ వాసులెల్ల నిండుహృదయములతో జయాశాస్యములు పలికిరి. పెద్దముత్తైదువలు శుభాక్షతలు చిలికిరి.

మాధవవర్మ సైన్యము కందారపురముఁ జేరెను. కందారపురదుర్గములోఁ గటకరాజగు బల్లహుని ప్రతినిధి యుండి పాలనము సాగించుచుండెను. కోటలోని యుద్యోగులలో నెవరో కొలఁదిమంది తప్ప నందఱు నాంధ్రులే. వారికి లోలోన మాధవవర్మ దండెత్తి వచ్చుట యానందము గలిగించెను. బల్లహుని ప్రతినిధి మాధవవర్మ దండురాక కొంతముందుగా నాలించి దుర్గరక్షకుల నప్రమత్తులై యుండనియమించి కటకరాజునకీ వార్త తెలియఁజేయుట కొకనిం బంచెను.

మాధవవర్మ యుగ్రగామిగానుండి కోట ముట్టడించెను. బల్లహుని సైనికులు తెలుఁగుసేనతోఁ బోరు నలిపిరి. కాని,

తెలుఁగు యువకుల ము

దుత్కలసైనికులు పలాయితులు కావలసివచ్చినది. బల్లహుని ప్రతినిధి యకాండపాతముగా వచ్చిన యీ భండనమునకు భీతిల్లి యథాశక్తిగాఁ బ్రతిఘటించెను. తాను బంపిన వార్తవిని బల్లహుఁడు సైన్యముతో వచ్చి యెదుర్కొను నని యూసించి యెట్లో నిలఁద్రొక్కుకొని సంగరము చేయుచుండెను.

బల్లహుఁడు కటకసైనికులతో రెండవనాఁటికిఁ గంధారపురము చేరుకొనెను. మాధవవర్మను ముందుగా నెదుర్కొనెను. బల్లహుఁడు కనఁబడఁగానే మాధవుఁడు నేయిపడిన నిప్పువలె మండిపడి తలపడెను. బల్లహుని దృష్టిలోఁ దొట్టతొలుత మాధవుఁ డకృతాస్త్రుఁడుగాఁ గనఁబడెను. పోరు ముదిరినకొలఁది యతని విక్రమధోరణి నవగాహనము చేసికొని బల్లహుఁడు 'ఓహో' యనుకొనెను. క్రమక్రమముగా మాధవవర్మ కరవాలపుఁ దళత్తళలతోఁ గటకరాజు కన్నులు బైరులు క్రమ్మెను.

ఈ మాధవవర్మ, కంధారపురాధిపతియై చిరకాలము క్రితము తనకత్తి కెరయైన సోమదేవభూపాలుని కుమారుఁడని బల్లహుఁడు నమ్మలేకపోయెను. మాధవవర్మ క్షణక్షణ వర్ధమానమైన బలోత్సాహములతో "ఓరీ! నీతాతమూటగాఁ గంధారపుఁగోట యాక్రమించితివి. ధర్మమూర్తియైననాతండ్రిని జంపి నాతల్లిని కష్టాలపాలు చేసితివి. నిన్ను బ్రతుకనిత్తు ననుకొంటివా!" యని గర్జించి పోరుచుఁ దనచేతి నిశితహే

తిత్తో బల్లహుని గుండెలపై బొడిచెను. ఆపోటుతోఁ గటక రాజు 'కటకటా!' యని యఱచుచు నసువులు వీడెను.

మాధవవర్మకుఁ బైతృకమైన కందారరాజ్యము స్వాధీనమాయెను. ఆతని వీరసంపదకు, బాహుపరాక్రమమునకు, దెలుఁగులోకమెల్ల జేజేలు వెట్టెను. ఆంధ్రరాజ్య పునస్థాపన మహోత్సవమునకు మాధవవర్మ యాదేశముతో విజయతోరణములు కట్టఁబడెను.

విజయసుందరగాత్రుఁడగు 'మాధవవర్మ' యనుమకొండకుఁ బోయి కటకరాజ రక్తముతోఁ దడిసిన చేతికరవాలము మాతృదేవి పాదముల ముందుంచి మ్రొక్కి, వృద్ధమాధవశర్మకుఁ గృతజ్ఞతతో సాష్టాంగపడి వారి యాశీస్సులతో నానందాశ్రువులతో నభిషిక్తుఁ డయ్యెను. మాధవశర్మ సిరియాలు దేవిని జూచి, తననిర్భరానందము నిట్లు వెల్లడించెను.

"అమ్మా! నీవు వీరమాతవైతివి. నీమూలమున నా గృహము, నాజీవితము చరితార్థము లైనవి. నీవు పడిన కష్టములకు ఫలము లభించినది. మాధవుని పరిపాలనముతోఁ దెలుఁగుదేశమున సువర్ణము పండఁగలదు. ఇది యంతయుఁ బద్మాక్షీవరప్రసాదము. నీభర్తయగు సోమదేవభూపాలుని గోసేవా వ్రతఫలము. ఈ శతవృద్ధు మాధవుని స్వరాజ్య సంస్థాపనోత్సవము చూచుటకు నోఁచుకొని యింతవఱకు జీవించి యున్నాఁడు ... మాధవవర్మా! ఆంధ్రమాతకు నీ జీవిత చరిత్ర మమృతాభిషేకము".

# గొంకరాజు

## ౧

విక్రమాదిత్యచక్రవర్తికి నేఁడు బొత్తిగాఁ జిత్తస్వాస్థ్య
ము లేదు. అతఁడు కర్ణాట సామ్రాజ్యాధిపతి కావచ్చును.
పశ్చిమ చాళుక్య చక్రవర్తి కావచ్చును. త్రిభువనమల్లుఁడే
కావచ్చును. ఎంత యధికుఁడైన నేమి? ఒక సామంత మండ
లేశ్వరుఁడు తనసైనికుల నోడించి విజయలక్ష్మిని చేకొనుట
కన్నులారఁ జూడవలసివచ్చినది. ఈపరిస్థితి తలఁచుకొన్న
కొలఁది యతని హృదయము కలఁతపడుచున్నది; ఆలో
చించిన కొలఁది కోపోద్రిక్త మగుచున్నది. క్రోధారుణితము
లైన యాతని కన్నులు చూచి ప్రక్కనున్న యొకమహావీరుఁ
డిట్లు పలికెను,

"ప్రభూ! సెలవైనచో స్వయముగా నేను సంగ్రామ
మునకుఁ బోయి వెలనాఁటి చోడునకు గర్వభంగము గావించి,
దుర్జయ వంశస్థుల వేంగిదుర్గము లాక్రమించి తెలుఁగుదేశమునఁ
శ్చిమచాళుక్య జయధ్వజములు నాఁటి వచ్చెదను".

ఈ మాటలు విక్రమాదిత్యుని యుద్రిక్త హృదయక్షేత్రముపై నమృతవర్షమువలెఁ బడెను. అతఁడు మహాసామంతాధిపతియగు ననంతపాలదండనాథుని శక్తిసామర్థ్యము లెఱిఁగినవాఁడు. అట్టి మహావీరుఁడు తలఁచుకొన్నచో వేంగి రాజ్యాక్రమణము ఘనకార్యముకాదు. "అనంతపాలా! నీవు సైన్యములను వెంట గొనిపోయి తెలుఁగుదుర్గము లన్నియు నాక్రమించుకొని వచ్చిన తరువాత మాటాడుకొందము. ఒక దుర్జయవంశీయునిచేత మనసైనికులు పరాభూతులై వచ్చిరనఁగా మాకుఁ దలకొట్టినట్టు లున్నది. ఆలసింపక నీవు శీఘ్ర ప్రస్థానము సాగింపవలె" నని విక్రమాదిత్యుఁడు పలుకఁగా ననంతపాలుఁడు 'దేవరచిత్త' మని బయలుదేఱెను.

మఱునాఁడు కర్ణాట సేనాసాహాయ్యముతో ననంత పాలుఁడు వేంగీరాజ్యాక్రమణమునకుఁ బ్రస్థానము సాగించెను. అనంతపాలుఁడు "రణరంగరాఘవుఁ"డని పేరుగాంచిన మహేశ్వర దండనాయకుని కుమారుఁడు. అశ్వత్థామ వంటి విక్రమ సంపద, సాహసోత్సాహములు కల వీరుఁడు. అనంతపాలునకు గోవిందనాయకుఁడు, లక్ష్మణుఁడు అను నిద్దఱు మేనల్లుండ్రు కలరు. వారిరువురు 'అనియంకభీము'లని ప్రఖ్యాతబిరుదము నందిన దండనాయకులు. సర్వవిధముల వారిది మేనమామ పోలిక.

అనంతపాలుఁడు తానొక్కఁడే లోకమును గ్రుక్కిలి గొనుటకుఁ దగిన పరాక్రమవంతుఁడు. అట్టివానికి గోవింద

లక్ష్మణుల తోడ్పాటొకటి. ఇంకఁ జెప్పుట కేమున్నది? తురగ రేఖా రేవంతులతో, సాహిణులతో, ననంతపాల దండనాయకుఁడు వేంగీరాజ్యమును గబళించుటకుఁ బగపూని బయలు దేఱెను.

దుర్నిరీక్ష్యమైన విక్రమాదిత్య సేనావాహిని యురకలు వేసికొనుచు నాంధ్రధరణిని ముంచెత్తినది. ఆసైన్యము నడచిన ప్రదేశ మెల్లఁ జవుడువాఱిపోవుచుండెను. అప్రతిహతమైన యాదండు చూచి చాలమంది గుండెలు పగిలి మరణించిరి. అనంతపాలుని హుంకారముతోనే కొందఱు డిందిరి. ఇట్టి భయంకర దండయాత్ర యెన్నఁడు చూచియెఱుఁగ మని తెలుఁగుపెద్దలు నిశ్చేష్టులైరి.

అనంతపాలుని సేనలు తొట్టతొలుత 'విజయవాడకోట' ముట్టడి కుపక్రమించెను. వెలనాటి చోడరాజు వెనుక నొక సారి విక్రమాదిత్యవరూథినితో హోరాహోరిగాఁ బోరి యీ విజయవాడలోనే గెలుపు సంపాదించెను. విజయవాడ పోరాటము పశ్చిమచాళుక్యసైనికు లెవ్వరును మఱచిపోలేదు. లోలోపల విక్రమచోడునితో యుద్ధము చేయుట వారికి భీతిహేతువు. కాని, యనంతపాలుఁడు, గోవింద లక్ష్మణులు నుండఁగా వారి కొక యపూర్వధైర్యము కలిగెను. పొంగిన కృష్ణానదివలె విజయవాడనెల్ల విక్రమాదిత్య వాహిని ముంచియెత్తెను. వేంగి రాజుల సైన్య మనన్యలభ్యమైన యభినివేశముతో శాత్రవుల నెదుర్కొని పోరాడెను.

కొన్నాళ్ళు వారికిఁ బోరాట మావిధమున సాగినది. ఏ విజయవాడకోటసంగ్రామమున వెలనాటి చోడభూపతి మున్ను విజయలక్ష్మిని సంపాదించెనో, ఆ విజయవాడకోట సంగరములోనే, నేఁ డా చోడభూపతి యపజయము పాలుపడ వలసివచ్చెను. అనంతపాలుఁడు విజయవాడదుర్గ మాక్రమించి పశ్చిమచాళుక్యచక్రవర్తియగు విక్రమాదిత్యుని పేర జయ ధ్వజము నాఁటెను.

వేంగిరాజ్యాక్రమణ గ్రంథములోఁ దొలి ప్రకరణముగా విజయవాడ ముట్టడించి యనంతపాలుఁడు దురంత పరాక్రమ ముతో, గుంటూరుమండలములోని చందవోలు దుర్గము నాక్రమింపఁబోయెను. అక్కడ వెలనాటి చోడరాజు కుమా రుఁడు గొంకభూపతి యనంతపాలు నెదురుకొని కదనము గావించెను. గొంకభూపతి తన తండ్రిని మించిన బాహువిక్ర మము కలవాఁడు. అతఁడు సంగరాంగణమున నిలఁబడినచో నెట్టివాఁడైన శృంగభంగము నందితీరును. అచంచలమైన పట్టు దల, అఖండమైన శరలాఘవచాకచక్యము, అమోఘమైన చోళచాళుక్యప్రభుభక్తి- యిన్ని సుగుణములు మూర్తీభ వించినవ్యక్తి గొంకభూపతి. చందవోలు దుర్గ సంరక్షణమున గొంకరాజు పట్టినపట్టు శ్లాఘాపాత్రమైనది. కాని, దైవ విలాసము విపరీతముగా నున్నపుడు పౌరుషము పనిచేయదు గదా!

అనంతపాలుఁడు చందవోలుకోటపై కర్ణాటపతాక మెగురవైచెను. బెజవాడదుర్గము, చందవోలుదుర్గము తన

వశమగుటచే నింక నాతనికిఁ బట్టఁబగ్గములు లేవు. గోవింద, లక్ష్మణ దండనాయకు లిరువురు మేనమామ యుత్సాహాగ్నిని మఱింత రగిలించుచు సమరము సాగించిరి. అనంతపాలుఁడు క్రమముగా యావదాంధ్రము నాపోశనింపవచ్చు నని భావించెను. ఆ యావేశములో, నా విజయానందములో, నా సంగరోత్సాహములో ననంతపాలునకు నొకటికాదు, రెండుకాదు తెలుఁగు దేశములోని దుర్గములు పెక్కు స్వాధీనములయినవి.

పూర్వ చాళుక్యరాజుల తొలిరాజధాని 'వేంగి' చేతఁ జిక్కినది. తూర్పుగోదావరీమండలములోని జననాథపురము (దక్షారామము) స్వాయత్తమైనది. చేబ్రోలుకోట చేతియుసిరిక యైనది. ఈకోటలు స్వాధీనపఱచుకొనుటలో ననంతపాలుని సైనికు లాయాగ్రామములకుఁ గల్పించిన నష్టము లపారములైనవి. కోటలు తొలినాఁటి స్వరూపసౌష్ఠవములను గోలుపోయి చాలభాగము కొఁదువాఱిపోయినవి. ఆంధ్రదుర్గములలో నెక్కడఁజూచినఁ గర్ణాటవైజయంతిక లెగురుచుండెను. ఆంధ్రమండలేశ్వరులందఱు కర్ణాటరాజునకుఁ గప్పముగట్టుచుఁ జేతులుకట్టుకొని నిలఁబడి జోహారు చేయవలసినవారైరి. నాఁటి విక్రమాదిత్యమహారాజు కాలములో నాంధ్రదేశమునఁ గర్ణాటసంస్కృతిసంపర్కము ముదిరి తెలుఁగుఁదనము సన్నగిల్లుచున్న దేమో యనిపించెను.

తెలుఁగుచరిత్రలో "మండలికయుగ" మొక స్వర్ణ స్తంభము వంటిదైనచో వెలనాటి నాయకులా స్తంభముపైఁ బొదిగిన రత్నములవంటివారు. వెలనాటినాయకులు దుర్జయ వంశీయులు. పూర్వ చాళుక్య చోళ ప్రభువులను దైవసములుగా భావించి వారి సామంతులై విక్రమవంతులై యనితర సాధారణమైన ప్రభుసేవాసక్తిని ప్రకటించి ధన్యులైనవారు.

చాళుక్యవంశవర్ధనుఁడగు రాజరాజ నరేంద్రుని యనంతర మాతని సంతానరత్నమైన కులోత్తుంగచోళుఁడు తన రాజధానిని వేంగిదేశమునుండి యరవదేశమునకు మార్చుకొనెను. మాతామహస్థానమగు చోళధారుణికిఁ, బైతృకముగా సంక్రమించిన తెలుఁగునేలకుఁ గులోత్తుంగుఁడే ప్రభువాయెను. అందులకే, యీతని నుభయకులోత్తుంగచోడుఁడని ప్రశంసించిరి.

కులోత్తుంగచక్రవర్తి యరవదేశమునుండి పెద్దయుద్యోగులను, సేనానాయకులను దెనుఁగుదేశమునకుఁ బంపుచుఁ, దన కుమారులను ప్రతినిధులుగా నుంచుచుఁ బరిపాలనశ్రద్ధ చూపకపోవుటచే నాంధ్రరాజ్యము చెదరి సామంతపాలనము పాలైనది.

కులోత్తుంగచోడచక్రవర్తికిఁ బశ్చిమ చాళుక్యచక్రవర్తి యగు త్రిభువనమల్ల విక్రమాదిత్యునకుఁ గల వైరబీజములు

నానాఁటికిఁ బెంపొందసాగినవి. వేంగిదేశమును మ్రింగఁజూచు చున్న యీ కర్ణాటరాజునెడ సందేహముతోఁ దెలుఁగుదేశ మునఁ బ్రతినిధులై పాలించుచున్న తనకుమారుల కండగా నుండుటకై కొందఱు భృత్యవంశీయులకు రాజలాంఛనము లొసంగి వారిని మండలేశ్వరులనుగాఁ జేసెను. ఆ భృత్య వంశస్థులు చిరకాలమునుండి చాళుక్యరాజులకు నమ్మినబంటులు. వారెన్నఁడును దాముకొలిచెడి ప్రభువులకు ద్రోహముచేసిన వారుకారు. బలపరాక్రమములందుఁ జాళుక్య చోళరాజు లకు సమానులు.

పూర్వాంధ్ర దేశమును మండలములుగా విభజించుకొని పరిపాలించిన వంశమునకు వెలనాఁటివంశ మని పేరు. ఈవంశ మునకే దుర్జయవంశమనియుఁ బేరువచ్చినది. కన్నడరాజగు విక్రమాదిత్యుని సైన్యము విజయవాడ, చందవోలు మున్నగు తెలుఁగుదుర్గములు ముట్టడించుటకు వచ్చిన సందర్భమునఁ దమ విక్రమములను బ్రదర్శించి సంగరముచేసిన వెలనాఁటి-చోడరాజు, ఆతనికుమారుఁడగు గొంకరాజు దుర్జయవంశములో రత్నముల వంటివారు.

నేఁడు చోడరాజు, గొంకరాజుకూడఁ బరాధీనస్థితిలో నుండవలసివచ్చినది. చోళ చాళుక్యప్రభువులను గొలుచుట వారికిష్టముగాని, విక్రమాదిత్యునకుఁ గ్రిందివారై యుండుట బొత్తిగా నిష్టములేదు. కాని, తెలుఁగుదేశమునకుఁ గర్ణాటరాజ పరిపాలనము తప్పనిదయ్యెను. పరరాజుల దాస్యవిముక్తికై

వెలనాఁటి చోడరాజుకుమారుఁడు "గోంకరాజు" పడుచున్న శ్రమ యింతయని చెప్పనలవిగానిది.

---

# 3

విజయవాడ కారాగారమున నెవరో యిరువురు బంధితులై యుండిరి. వీరకంకణములు దాల్చెడి వారిచేతుల కినుప సంకెలలు వేయఁబడియున్నవి. వారిముఖములలో విచారము గాని విషాదముగాని యెక్కడను గానఁబడుటలేదు. కారాగారమునఁ గట్టఁబడియున్న వారి వదనములలో నట్టి ధైర్యము, నుత్సాహము చూచినచో వింత కలిగింపకమానదు. ఆయిద్దఱిలో నొకఁడు వృద్ధుఁడు. రెండవవాఁడు యువకుఁడు. పోలికలనుబట్టి ముసలివాఁడు యువకునకుఁ దండ్రివలెఁ గనిపించుచున్నాఁడు. వారిలో వారు మెల్లఁగా నిట్లు సంభాషించుకొనుచున్నారు.

వృద్ధుఁడు:- నాయనా! మనమీ కారాగారముననుండి బయటఁ బడు నుపాయ మేమైన నాలోచించితివా ?

యువకుఁడు:-నాన్నగారూ! ఉపాయమున కేమున్నది! ఈరాత్రి వేళ నిక్కడనున్న కావలివానిని గానిచ్చి మనమీ బంధము తప్పించుకొనవలయును.

వృద్ధుఁడు:- ఏమో! ఎట్లుచేయవలెనో నాకేమియుఁ దోఁచుట లేదు. చాళుక్య చోళప్రభువులయెడ ఋణవిముక్తి చేసికొనుట యీజన్మకుండునా యని సందేహించు చున్నాను.

యువకుఁడు:- నాన్నగారూ! మీరేమియు సందేహింపవలదు. ఈబంధవిముక్తియుఁ బ్రభువుల ఋణవిముక్తియునొక్క సారియే. పశ్చిమచాళుక్యుల కర్ణాట పతాక తెలుఁగు దుర్గములపై నిఁక నెగురనీయను. అనంతపాలుఁడు కాదు, గోవింద దండనాయకుఁడు కాదు, హరిబ్రహ్మాదు లెవరడ్డువచ్చినను చాళుక్య చోళపతాకము లాంధ్ర దుర్గాగ్రములపై బ్రతిష్ఠించి తీరెదను.

వృద్ధు:- నాయనా! తొందరపడకుము. ముందు మన మీ నిర్బంధమునుండి తొలఁగి బయటఁబడవలయును. తరు వాత నేమిచేసినను జేయవచ్చును. విక్రమాదిత్యుఁడు చండశాసనుఁడు. సైన్యబలము గలవాఁడు. దానికిఁ దోడు రెండవయశ్వత్థామవంటి యనంతపాలుఁడొకఁడు. అతని విక్రమసంపద స్మరించినచో నాకుఁ జెప్పకపోవ నేల! కొంచెము వెఱపు కలుగుచుండును. ఒకటికాదు విజయవాడదుర్గము, చందవోలు కోట, జననాథపుర దుర్గము, చేబ్రోలుకోట యిన్ని- యొక్కసారి యాక్ర మించుకొఁగలిగె ననఁగా ననంతపాలుఁ డెంత పరా క్రమవంతుఁడో యోచింపుము. అట్టివానితో మనము

ప్రతిఘటించుట సాధారణమైన పని కాదు. చెలుఁ దొలఁగి మనప్రభువు విక్రమచోళుని కలసికొని కులోత్తుంగచోడచక్రవర్తి సాహాయ్యముఁ గైకొని కార్యము సాధింపవలయును.

యువ:- నాన్నగారూ! ఈమాసము దాటకుండ వేంగిసామ్రాజ్యమునుండి కర్ణాటులను దఱిమివేయఁగలను. మీ రేమియు భయపడవలదు. సందేహపడవలదు. కర్ణాటాధిపతి విక్రమాదిత్యుఁడు మరణించిన తరువాతఁ గన్నడదేశమంతయు నేఁడస్తవ్యస్తముగా నున్నది. అతనికుమారుఁడు భూలోకమల్లసోమేశ్వరుఁ డిప్పుడు ప్రభువైనాఁడు. క్రొత్తగా రాచఱికమునకు వచ్చియుండుటచే భూలోకమల్లుఁడు కర్ణాటదేశసంరక్షణము నందే శ్రద్ధవహించుచున్నాఁడు. అతనికిఁ దెలుఁగుదేశ మేమగుచున్నదో యన్న శ్రద్ధయున్నట్లులేదు. ఇక్కడి దుర్గములకుఁ బ్రతినిధులై పాలించుచున్న కర్ణాటదండనాయకులును "మన కేమి" యను భావముతో నేమఱుపాటుగా నుండియుందురు. ఈసమయమున స్వరాజ్య సంపాదనము మనకు దుస్సాధముకాదు.

వృద్ధు:- నాయనా! నీవు "దుర్జయ"వంశస్థులు మాటాడవలసిన తీరున మాటాడితివి. చిన్నవాఁడవైనను నీకు ధైర్య సాహసములు హెచ్చు. వృద్ధుఁడనగుటచే నాకు రక్త పటిమ తగ్గి యధైర్య మావరించుటయు సహజము.

చోళచాళుక్యసామ్రాజ్యమును బునస్థ్సాపనముచేసి మన వంశ గౌరవమును గాపాడి పితృభక్తిని వెల్లడించు బాధ్యత నీయందున్నది. కాళహస్తీశ్వరుని కరుణ నీయెడల నిండారుఁగాక!

యువ:- మన మీగండము గడచి బయటఁబడినచో నేదైనను సాధింపవచ్చును. కానిండు. ఈరాత్రియే కావలివానిని బరిమార్చి యీ కారాగారమునుండి విముక్తులము కావలయును. ఈ కర్ణాట ప్రతినిధుల కన్నులలోఁ గారము గొట్టవలయును.

వారిరువురు మఱికొంతసేపు బహురహస్యముగా నేదో మాటాడుకొనిరి. యువకుఁడు వృద్ధునిచెవిలో చివర నేదియో చెప్పి మందహాసము చేసెను. ఆయువకుని చిఱునవ్వు చూచి వృద్ధుని మొగము వికసించెను. ఇరువురు నొకరివైపొకరు సాభిప్రాయముగాఁ జూచుకొనిరి.

---

## ౪

విక్రమాదిత్య చక్రవర్తి కుమారుఁడు భూలోకమల్ల సోమేశ్వరుఁడు కర్ణాటకమునకు నేఁడుప్రభువు. విక్రమాదిత్యుని యనంతర మాతని కొక పెద్దబాధ్యత తలపైఁబడినది. తండ్రి

వెనుక నతఁడు వినోదములతోఁ గాలక్షేపము చేయుచుండెడి వాఁడు; సామ్రాజ్యమం దేమి జరుగుచున్నను, నాతనికొక దిగు లుండెడిదికాదు. కాని, సోమేశ్వరచక్రవర్తి రాజ్యతంత్రము లలోఁ దెలివిగలవాఁడు కాకపోలేదు. తాను ప్రభుత్వమునకు వచ్చినతరువాతఁగాని దానిని ప్రదర్శించుట యతనికిష్టము లేకపోయెనుగాఁబోలు !

భూలోకమల్ల సోమేశ్వరచక్రవర్తి యొకనాఁడు కొలువు దీర్చియుండెను. గోవింద దండనాయకుఁడు, అతని కుమారుఁడు దండాధిప లక్ష్మరాజు, సిద్ధిరాజ దండనాయకుఁడు, అతని పుత్రుఁడు కేచిమయ్య మున్నగు మహావీరులందఱు కొలువులో నుండిరి. చక్రవర్తి వారి నందఱనుజూచి యిట్లు వచించెను:—

"వింటిరా ! వేంగిదేశపుఁ బరిస్థితి యెట్లుమాఱినదో ! మా తండ్రిగారు వేంగిదేశ సంరక్షణమునకై 'అనంతపాలుఁడు' మున్నగువారి నక్కడఁ బ్రతినిధులుగా నియమించినారు. అనంతపాలుఁడు మహావీరుఁడనుటలో నాకు సందేహములేదు. అతఁ డింతవఱకు బహుజాగరూకతతో వేంగిని సంరక్షించు చున్నాఁడు. కాని, వెలనాఁటి చోడరాజు, ఆతని కుమారుఁడు ఇమ్మడిగొంకరాజు నాలుగు నాళ్ళక్రిందట విజయవాడ కారా గారమునుండి యెట్లో తప్పించుకొనిపోయిరఁట. మనచే బంధితులైన వెలనాఁటివీరులు వారిద్దఱు తప్పించుకొని పోయిరనఁగా, రాజకీయముగా మనకది యెంతో నష్టకారణము. వారిద్దఱు గొప్ప పేరుమోసిన పరాక్రమవంతులు. వారిలో, చోడరాజు

కంటె సతనికుమారుఁడు 'గొంకరాజు' వయస్సుచేఁ జిన్నవాఁడయ్యు మహాబల పరాక్రమములు కలవాఁడు. ఆ తండ్రి కొడుకు లిరువురు విక్రమచోళుని యొద్దకుఁబోయి తెలుఁగుదుర్గములు తిరిగి యాక్రమించుకొనుటకుఁ బన్నాగములు పన్నుచుందురు. వారు ముగ్గురు కలసినచో మనము వేంగిరాజ్యముపై నాస వదలుకోవలసినదే.

ఆలోచింపఁగా, మా కొకటి తోఁచుచున్నది. అనంతపాలుఁడు మున్నగు మన ప్రతినిధులు వెలనాఁటి చోడులతోఁ గలసి యేదో కుట్రపన్నుచున్నారనిపించుచున్నది. కానిచో, విజయవాడ కారాగారమునుండి తప్పించుకొనిపోవుట కెన్ని గుండెలుండవలయును? దీనిలో, ఏదోపన్నుగడ యుండితీరును.

దీనికి, మే మొక విఱుగుడు నుపయోగింపఁ దలఁచుకొంటిమి. వేంగిదేశ సంరక్షకులుగానున్న యనంతపాలాది దండనాయకులను గర్ణాటమునకు రప్పించుకొనవలయును. వారికి బదులుగా మీ[illegible]ఁగొందఱు తెలుఁగు దుర్గములకుఁ బ్రతినిధి [illegible] ఈ మార్పు జరిగినచో వెలనాఁటిచోడులకుఁ దెనుఁగుకోటలు వశముకాకుండ నభేద్యములుగా నుండఁగలవు. గోవింద దండనాయకుఁడు, దండాధిప లక్ష్మరాజు, సిద్ధిరాజు దండనాయకుఁడు, కేచిమయ్య, వీరు నలుగురు వేంగిదేశమున కేఁగి దుర్గసంరక్షణము చేయవలయునని యాదేశించుచున్నాము. అనంతపాలాదులు వేంగినివిడిచి స్వదేశమునకుఁ దిరిగివచ్చునట్లుగా నాజ్ఞాపత్రములు పంపించె

దము. అప్రమత్తులై యానలువురును దెలుగుఁగోటలు కాపాడి వెలనాఁటిచోడుల తంత్రములను బ్రతిఘటించుచుండవలసి యున్నది."

భూలోకమల్ల చక్రవర్తి యాజ్ఞకు గోవింద దండనాయకాదులు నలువురు తలలొగ్గిరి. సముచితమైన సైన్యమును వెంటఁగొని వారు మఱునాఁడే వేంగీదేశమునకుఁ బయనమైరి. అనంతపాలాదుల ప్రాతినిధ్యమునకుఁ దెలుఁగునాఁట నీఁక స్వస్తి చెప్పఁబడెను.

---

౫

క్రీస్తుశకము ౧౧౨౬ సంవత్సరమున పశ్చిమ చాళుక్య సార్వభౌముఁడు విక్రమాదిత్యుఁడు స్వర్గస్థుఁడయ్యెను. అది మొదలు విక్రమచోడ చక్రవర్తికిఁ గొంత మనశ్శాంతి యేర్పడెను. పశ్చిమ చాళుక్యరాజగు విక్రమాదిత్యుఁడు సామాన్యుఁడుకాఁడు. ఆతని కాలములోఁ బరాధీనమైన తెలుఁగు దుర్గములను స్వాధీనము చేసికొనుట యెవ్వరితరమును గాక పోయినది.

కాళహస్తీశ్వరుని సన్నిధానమున నొకనాఁడు విక్రమచోడ చక్రవర్తియు, వెలనాఁటి చోడరాజు, ఆతని కుమారుఁడు

గోంకనరేంద్రుఁడును సమావేశపడిరి. వారి ముఖ్వరముఖము లందు నవ్యక్తముగా నొక సంతోషతరంగము పొంగి ప్రవహించుచున్నటు లుండెను. వారు ముగ్వురు నీశ్వరసాక్షిగా నేదో ప్రతిజ్ఞ చేసికొనుట కచ్చటఁగూడియుందురని తెలియుచున్నది. విక్రమ చోడచక్రవర్తి ప్రతిదినము కాళహస్తీశ్వరుని సందర్శించి పోవుచుండును. ఈనాఁడుకూడ యెప్పటివలెనే యీశ్వరసందర్శనమున కామహారాజు విచ్చేసెను. అతనివెంట మఱియిద్దఱు క్రొత్తవారుండిరి. వారెవరో తెలిసికొందమను నూహ యక్కడివారికిఁ గలుగలేదు. మహారాజు గుడిలోనికి వెళ్ళివచ్చిన తరువాతఁగాని యితరభక్తులు, యాత్రికులు వెళ్ళుటకు వీలులేదు. ఈనాఁడు విక్రమచోడచక్రవర్తి యొక జాముసేపు దేవసన్నిధిలో నుండిపోయెను. అర్చకులకు, వచ్చిన భక్తులకు నిది యాశ్చర్యముగా నుండెను.

కాళహస్తీశ్వరారాధన మయినతరువాత, ముఖమండపముపైఁ గూరుచుండి విక్రమచోడచక్రవర్తి వెలనాఁటిచోడుని, గోంకరాజును జూచి యిట్లు పలికెను: "ఈశ్వరకరుణచే మీరు పశ్చిమచాళుక్యుల చెఱనుండి బయటఁబడి వచ్చితిరి. విజయవాడ కారాగారమునుండి మీరెట్లు తప్పించుకొనివచ్చితిరో, మిక్కిలి యాశ్చర్యముగా నున్నది. మీ తండ్రికొడుకు లిరువురు మాయెడల, తెలుఁగుదేశమునెడల నపారగౌరవాదరములు కలవారు. వీరాధివీరుఁడైన యనంతపాలుని

బారినుండి తొలఁగిపచ్చుట సాధారణకార్యము కాదు. ప్రకృతము మన కర్తవ్య మేమి యాలోచించితిరి?"

గోంకరాజు వినయవినమితశిరస్కుఁడై మహారాజుతో నిట్లు పలికెను:

"ప్రభూ! అనంతపాలుని బుట్టలోఁ బెట్టుకొంటిమి. చెఱనుండి యెట్లు బయటఁబడితిమో యీగాథయంతయు నునవిచేసి విసిగింపను. ఇప్పుడు భావికార్యక్రమమునుగూర్చి యోచింపవలెను. అనంతపాలాది ప్రతినిధులపై పశ్చిమచాళుక్య చక్రవర్తి యగు భూలోకమల్లునకు విశ్వాసము పూర్తిగాఁ బోయినదని విన్నాను. మేము కారాగారమునుండి తప్పించుకొనిపోవుటలో ననంతపాలుని పరిసుత్తత కారణమైయుండునని భూలోకమల్లుఁడు భావించి యాంధ్రదుర్గ రక్షణకై క్రొత్తవారిని గొంపఱిని కర్ణాటమునుండి పంపుచున్నాఁడనియు, ననంతపాలాదులను దిరిగి కన్నడదేశము వచ్చివేయవలె నని యాజ్ఞాపించెననియు నిన్ననే తెలిసికొంటిని. ఇంక మన ప్రయత్నము సఫలమైనట్లే. సందేహాము లేదు. ఇపుడు కన్నడమునుండి వచ్చువారందఱును క్రొత్తవారు. వారికిక్కడ దుర్గముల లోఁతుపాతులు తెలియవు. అనంతపాలుఁడు భూలోకమల్లచక్రవర్తి యెడలఁ గసితో నుండును. తన ప్రాతినిధ్యము బాగుగాలేదని చక్రవర్తి యాక్షేపించుటయే దీనికిఁ గారణము. ఈసందర్భమున వేంగిరాజ్యాక్రమణము మనకు సుకరము. కావున నాకస్మికముగా దుర్గముల నాక్రమించుటకుఁ

బ్రయత్నము చేసెదను. యథార్థమైన ప్రభుభక్తి కలవాఁడనై నచోఁ గన్నడపతాక పెఱికి తెలుఁగురాజ్యమున నాంధ్రజయ ధ్వజము నెలకొల్పఁగలవాఁడను. ప్రభువుల యానతికి, నాశీస్సులకు నంజలిపట్టుచున్నాను."

గొంకమయ్య యాలోచనమునకు విక్రమచోడుని హృదయ మానందభరితమయ్యెను. గొంకమయ్య తండ్రి వెలనాఁటిచోడరాజు యువకునివలె యుద్ధోత్సాహమును బ్రద ర్శించెను.

---

# ౬

గొంకరాజు నాయకత్వముతోఁ బశ్చిమచాళుక్యరాజుల పారతంత్ర్యమునుండి తెలుఁగుదేశమును విడిపింపఁజేయుటకు సర్వప్రయత్నములు జరిగెను. వెలనాఁటిదుర్జయవంశీయులందఱు నవనవోత్సాహములతో యుద్ధరంగములకు దూకిరి. గొంక రాజు మేనమామ పండయ్య, బావమఱఁది గొంకయ్య మున్న గువారు బెబ్బులవలె రణరంగమునఁ బ్రవేశించిరి. దుర్జయ వంశీయుల సేనావాహిని వేంగిదేశము నలుగడలను ముంచి యెత్తెను.

గొంకరాజు ఖడ్గపాణియై యెల్లయెడలఁ దానే కనిపిం చుచుఁ దన సైనికులను బురికొల్పుచు వేసవిసూర్యునివలె

వెలుఁగుచుండెను. పశ్చిమచాళుక్య మంత్రులు, దండనాయకులు గుమిగూడి దుర్జయుల నెదుర్కొనుటలో నెత్తులు వేసికొని తమ సేనలను వ్యూహములుగాఁ బన్నుచుండిరి. కళింగరాజులు పశ్చిమచాళుక్యులకుఁ దోడుగా వచ్చిరి. కర్ణాటరాజసేన మహాసముద్రమువలె భయంకరముగా నుండెను.

గోదావరీతీరమునఁ గర్ణాట సేనలకు, దుర్జయ సేనలకు దారుణమైన ప్రతిఘటనము జరిగెను. కళింగవాహిని తోడ్పాటుతోఁ గర్ణాట సేనల విజృంభణమునకుఁ బట్టఁబగ్గములులేవు. దుర్జయ సేనలు శక్తికొలఁది శాత్రవుల నెదుర్కొని కదనరంగమున విహారము చేయుచుండెను. గొంకరాజు పార్థునివలె యుద్ధముగావించుచుండఁగాఁ గర్ణాటవీరులకు గుండె బెదురుగా నుండెను. తన 'దుర్జయ' సేనలు శత్రువాహినిచే సంహరింపఁబడి పలుచవడిపోవుచున్నను 'గొంకమయ్య' యధైర్యపడక ద్విగుణీకృతోత్సాహముతోఁ బ్రళయరుద్రునివలెఁ బోరాటము సాగించుచుండెను. గొంకమయ్య వాఁడిఖడ్గమున కెరవై యెందఱో మహావీరులు వీరస్వర్గ మలంకరించిరి. గొంకరాజు హుంకారము విని గుండెలు పగిలి యెందఱో కర్ణాటవీరులు ప్రాణములు గోల్పోయిరి. అచంచలమైన మాతృదేశభక్తితో, అవ్యాజమైన చాళుక్యచోళపరిభుభక్తితో, అమోఘమైన బాహుశక్తితో యుద్ధరంగమునఁ గాలునివోలె విజృంభించిన 'గొంకమయ్య' రణనైపుణ్యమును జూచి యుభయపక్షముల వారు నివ్వెఱపడుచుండిరి. 'గొంకమయ్య' లో నిట్టి యద్భుత

యుద్ధకుశలత దాఁగియున్నదని కర్ణాటవీరులెవ్వరును దలంచి యుండలేదు.

'గొంకరాజు' నెదుర్కొని గోవిందదండనాయకుఁడు, లక్ష్మణదండనాయకుఁడు, కేచిమయ్య మున్నగు కర్ణాటవీరులు పోరుసలుపుచుండిరి. తనకుఁ దోడ్పాటుగాఁ జెప్పఁదగినవీరుఁ డెవ్వఁడును లేకున్నను 'గొంకరాజు' నిశ్శంకసాహసోత్సాహములతోఁ గర్ణాటవీరత్రియమును దానొక్కఁడే ప్రతిఘటించెను. అపూర్వము నమోఘమునైన గొంకమయ్య సమరచాతురికి శాత్రవులు చెల్లాచెదరగుచుండిరి. కళింగసేనలు కకావికలగుచుండెను.

గోవిందదండనాయకుఁడు, లక్ష్మణదండాధిపతి, కేచిమయ్య— ఈముగ్గురుమహావీరులును గొంకరాజు విక్రమాటోపమునకుఁ దాళలేకపోయిరి. వయస్సులో గొంకరాజు కర్ణాటవీరత్రియముకంటెఁ దక్కువవాఁడేకాని, పరాక్రమములో వారిని మించినవాఁడు. సైంధవవధనాఁడు పార్థుఁడు చూపిన విక్రమక్రమము నేఁడు గొంకరాజు ప్రదర్శించుచుండెనా? యనిపించినది. గోవిందదండనాయకాదులు ముగ్గురును గొంకరాజు ముందు నిలఁబడి తలపడుటకు సమర్థులుగాక పరాజితులై పలాయితులైరి.

కర్ణాటసేనాశోణితముచేఁ దడిసిన గొంకరాజు విజయఖడ్గమున కింక విశ్రాంతి లభించెను. పశ్చిమచాళుక్యుల పతా

కములుపోయి, చోళచాళుక్యవైజయంతికలు వేంగిదేశదుర్గ ములపై నెగురఁజొచ్చినవి. పరాక్రాంతములైన విజయవాడ, చందవోలు, జననాథపురము, చేబ్రోలు, వేంగి మున్నగు కోట లాంధ్రమాతృస్తవగీతములతోఁ బ్రతిధ్వనించినవి. ఎక్కడ విన్నను 'గొంకరాజ' పరాక్రమశ్లాఘావాక్యములే. ఎక్కడ నాలించినను వెలనాఁటిదుర్జయుల ప్రభుభక్తిప్రశంసలే. వెలనాఁటిచోళుని కదుపు నేఁటికి ఫలించినది. గొంకరాజు కోరిక నేఁటికి సఫలమైనది. తెలుఁగువారి వాంఛితము నేఁటి కీడేరినది. పశ్చిమచాళుక్యాధికారము నేఁటితో సమాప్తమైనది.

విజయలక్ష్మీవిరాజమానుఁడగు 'గొంకరాజు' చాళుక్య చోళచక్రవర్తియగు కులోత్తుంగచోడుని దర్శించుటకు బయలుదేఱెను. ఆహా! దుర్జయవంశీయుల ప్రభుభక్తి యెంతటిదో యరయుఁడు! తాను గర్ణాటసైన్యమును జెండాడి శాత్రవుల శిబిరములనుండి కొల్లఁగొట్టిన ధనకనకరాసులను, రథగజతురగాదులను వెంటఁబెట్టుకొని వెళ్ళి గొంకరాజు కులోత్తుంగచక్రవర్తి కుపాయనముగా నర్పించి, యిట్లు మనవి చేసికొనెను.

"ప్రభూ! ఈ కానుకలన్నియు దేవరవారివి. తమ యాశీర్బలమువలనఁ గర్ణాటపతాకలను బెఱికి వేంగిదుర్గములపై చోళచాళుక్యపతాకలను బ్రతిష్ఠించి వచ్చితిని. గోవింద దండనాయకాదులగు కర్ణాటవీరశిరోమణులందఱుఁ దమ

విధేయుని ఖడ్గధారకు బెదరి చెదరి పాఱిపోయినారు. నేటితోఁ బ్రభువుల ఋణమునుండి విముక్తుఁడ నగుచున్నాను. ఆంధ్ర రాజ్యము స్వాధీనముచేసికొని ప్రభువుల కర్పించి ధన్యుఁడ నగుచున్నాను. ఇంతకంటె నాకేమియు నక్కఱలేదు. దుర్జయ వంశము ప్రభుసేవాపరాయణ మైనదని యీసంఘటనము చాటినచో నాకదే పదివేలు."

గోంకరాజు సేవాధర్మమునకుఁ గులోత్తుంగచక్రవర్తి యాశ్చర్యపడి, యానందభరితుఁడై నిండుకొలువులో నాతని నభినందించి యిట్లు వచించెను:

"గోంకరాజా! చాళుక్యచోళ గౌరవమును గాపాడిన వీర మూర్ధన్యుఁడవు నీవు. నీ వీరత్వ మెంత శ్లాఘాపాత్రమో నీసౌజన్యమంత ప్రశంసాయోగ్యమైనది. వేంగిరాజ్యములోని దుర్గముల నన్నిటిని గర్ణాటుల బారినుండి తప్పించిన నీ పరాక్రమము హృదయపూర్వకముగా నభినందించుచున్నాను. "దుర్జయవంశీయులు" మాయెడల భక్తివిశ్వాసములు కలవారు. నీ వా వంశమునకు రత్నమువంటివాఁడవు. వెలనాఁటి చోడ రాజు నీవంటి పుత్రునిగని ధన్యుఁడయ్యెను. యావదాంధ్రమును నద్వితీయవిక్రమముతో నాక్రమించుకొంటివి. నీవు తెలుఁగు రాజ్యమును మా కర్పణచేయవలసిన యవసరము వాస్తవము నకు లేదు. కాని నీకుఁగల ప్రభుభక్తిని బురస్కరించుకొని యీ రాజ్యము నాకర్పించుటకు వచ్చియుంటివి. నీ సేవా ధర్మము తెలుఁగు దేశచరిత్రలో సువర్ణాక్షరములతో ముద్రింప

దగినదికాని సాధారణ మైనదికాదు. ఇట్టి యమోఘ విజయ గౌరవమును బ్రభువునకు దారవోయఁ దలఁచుకొన్న నీ నిష్కామరాజభక్తి యద్వితీయమైనది. చాళుక్యచోళసామ్రాజ్యము మీ "వెలనాటి దుర్జయవంశము" నెన్నఁటికి విస్మరింపఁజాలదు. నీ భుజబలముతో నార్జించిన యాంధ్రరాజ్యమునకు నిన్నుఁ బట్టాభిషిక్తునిఁ జేయుచున్నాను. సర్వాధికారములతో దానిని బరిపాలించుకొనుము."

కులోత్తుంగచోడచక్రవర్తి గొంకరాజు నాశీర్వదించి వేంగిరాజ్యాధిపతిగాఁ బట్టముగట్టెను. ఆసందర్భమున వైతాళికులు గొంకరాజు నీవిధముగాఁ గైవారముచేసిరి.

"చలమర్తిగండ, వీరమహేశ్వర, చాళుక్యరాజ్యభవన మూలస్తంభ, క్రీడాలోడిత గౌడకుంతల కుభ్యత్సేనార్ణవ, శివపాదశేఖర, వేంగి విషయషోడశ సహస్రావనీవల్లభ, శంకర కింకర, గొంకనరేంద్ర జయ విజయీభవ! జయవిజయీభవ!"

గొంకనరేంద్రుఁడు కులోత్తుంగునకు వినమ్రుడై మ్రొక్కి సెలవుఁ గైకొని తెలుఁగుదేశమునకు విచ్చేసి ధనదుపురమను నామాంతరముగల "చందవోలు" రాజధానిగాఁ బ్రాగాంధ్ర దేశమును క్రీస్తుశకము ౧౧౩౨ సం॥ నుండి ౧౧౬౨ సం॥ వఱకుఁ బరిపాలనము గావించెను. "మండలికయుగము" న గొంకరాజునకు సాటియైన పరాక్రమవంతుఁడు, ప్రభుభక్తి భరితుఁడు మఱియొకఁడు లేఁడనుట యతిశయోక్తి కాదు.

# అన్నమయ్య

## ౧

కడప మండలములోని తాళ్లపాక గ్రామములో 'తాళ్ల పాక' వారి కుటుంబములు నాలుగైదుకలవు. తాళ్లపాకవారు నందవరీక స్మార్త విప్రకుటుంబమునకుఁ జెందినవారు. వారందఱు సదాచార పరాయణులు, సత్యవాక్య పరిపాలకులు. ఒకరికింత యాతిథ్యమిచ్చుటకుఁ దాము తృప్తిగా భుజించుటకుఁ దగినసంపత్తి కలవారు. 'తాళ్లపాక'లో అన్నమయ్య యను వ్యక్తిపేరు విన్నవారు పెక్కుమందియుండరు. అన్నమయ్య పదునాఱు సంవత్సరముల వయస్సువచ్చువఱకుఁ జదువు సంధ్యలతో సంబంధములేక మందునివలెఁ దిరుగుచుండెడివాఁడు. 'రఘువంశము' చంకనుబెట్టుకొని గురువుగారి యింటికి వెళ్లి వచ్చుటయేతప్ప నతనికొక యక్షరమైనను వచ్చినట్లులేదని గ్రామస్థులు పరిహసించుచుండెడివారు.

అన్నమయ్య చిన్ననాఁటినుండియుఁ బరిహాసములకు లెక్కసేయని స్వభావముకలవాఁడు. ముఖముమీఁద నాడి పోసినను దుడిచివేసికొను చిత్తవృత్తి యతనికి వెన్నతోఁ

బెట్టినది. కాని, యూరిలో నొకరిద్దఱకుఁదప్ప నతనిలో నంత ర్గతముగానున్న యున్నతభావమును గ్రహించినవారులేరు. అన్నమయ్య జడబుద్ధియనియు, వెఱ్ఱివాఁడనియుఁ గొందఱు పరిహాసము చేయుచుండుట విన్నప్పు డాతని తలిదండ్రులకుఁ జాల దిగులుగా నుండెడిది. తన్నుఁ బరిహసించువారినిజూచి 'యన్నమయ్య' చిఱునవ్వు నవ్వుకొని పోవుచుండువాఁడు.

అన్నమయ్య పసితనమునుండియు నేకాంతమునఁ గూర్చుండుట కలవాటుపడెను. అతనికి సంఘములోఁ గూర్చుం డుటకాని, లేనిపోని మాటలతోఁ గాలక్షేపము చేయుటకాని కిట్టదు. తా నొక్కఁడు నేతోఁటలోనికో, యే దొడ్డిలోనికో పోయి తనలోఁదాను కూనిరాగములు తీసికొనుచుండువాఁడు. అతని యీ యేకాంతస్థితిని జూచిన యజ్ఞులుకొందఱు 'పిచ్చి వాఁ'డని పరిహాసము చేయుచుందురు.

అన్నమయ్య పూర్ణచంద్రునివలె షోడశవర్ష వయస్కుఁ డయ్యెను. ఇప్పుడిప్పుడే యతని కన్నులలో వెనుకలేని యుజ్జ్వ లత్వము నరసి పెద్దలు కొంద ఱాశ్చర్యపడుచుండిరి. అన్న మయ్య శ్రీ వేంకటేశ్వరస్వామి భక్తుఁడు. అతఁడు ప్రభా తమున నిద్రనుండి మేలుకాంచినతోడనే మధురమైన కంఠ స్వరముతో వేంకటేశ్వరస్వామిపైఁ గీర్తన లేవో పాడుకొను చుండును. ఆ కీర్తన లాతఁడు స్వయముగా రచించినవేకాని, యితరకవి యెవ్వఁడును రచించినవికావు. ఈ విషయము గ్రాహ్య

స్థులలోఁ బెక్కుమందికిఁ దెలియదు. ఎవరో వ్రాసినపాటలు 'అన్నమయ్య' పాడుకొనుచుండెనని వారిభావము.

ఒకనాఁటి సుప్రభాతమున నన్నమయ్య యీ క్రింది పాట పాడుకొనుచుండెను:—

'పాలయలుక నిద్దురలు భోగించ దొరకొంటి
వలర వడిమేల్కొనవె - అఖిలేశ్వరా !
తరుణికై నపుడె పరితాపసూర్యుఁడు వొడిచె
వరుసఁ జెవికన్నుఁగలువలు మొగిచెను
మరుని సాయకపుఁదామరలు వడివికసించె
కరుణతో మేల్కొనవె కమలేశ్వరా !
కాంత నిట్టూర్పులను గాలియును నగ్నియును
వంత చెమటలవాన వరుణుఁడును
వింతలుగ నిన్ను సేవింతుమని యున్నారు
పంతమున మేల్కొనవె పరమేశ్వరా !'

* * *

"తాళ్లపాక" వీథివెంటఁబోవుచు నొక బాటసారి యీ పాటవిని యాఁగి నిశ్చేష్టుఁడై సాంతముగాఁ గీర్తనమాలించెను. ఆ బాటసారి సాధారణుఁడుకాఁడు. సాళువ నరసింహారాయల మిత్త్రుఁడైన యొక భూస్వామి. అతఁడు చదువుకొన్నవాఁడు. వేంకటేశ్వర పదారాధన తత్పరుఁడు. శ్రుతిపేయమైన వేంకటేశ్వర ప్రభాతగీతము చెవినిబడఁగనే యతఁడు పరవశుఁడై ముందునకు సాగలేగపోయెను. ఈ పాటగాఁడెవఁడో తెలిసి...

కొందమును జిజ్ఞాస యతని కుదయించెను. వెంటనే 'అన్న మయ్య' యున్నచోటికి వెళ్లిచూచెను.

అన్నమయ్య వీథియరుగుపై గూరుచుండి భక్తినిమీలితలోచనుఁడై "కడగి మేల్కొనవె వేంకటరమణుఁడ!" యని పాడుచుఁ బది నిముసములకుఁ గన్నులు తెఱచి చూచెను. చూచినతోడనే చేతులుజోడించి నిలఁబడియున్న యొకనూతన పురుషుఁడతనికి గోచరించెను. అన్నమయ్యకు వేంకటేశ్వర సాక్షాత్కార మైనంత యానందము కలిగెను. అతఁడు వెంటనే "మహానుభావా! దయచేయుఁ"డని క్రొత్తపురుషు నాహ్వానించెను. ఆబాటసారి వినయ వినమిత గాత్రుఁడై యన్నమయ్యకు నమస్కరించి యిట్లు పలికెను.

"తమరెవరో మహాభక్తులుగా, గాయకోత్తములుగా నున్నారు. పేరు తెలిసికొనుటకు వేడుకపడుచున్నాను."

"అయ్యా! నేను వేంకటేశ్వర శ్రీ చరణరేణువను. నా పేరు 'అన్నమయ్య' యందురు. తమరెక్కడినుండి రాక?"

"నేను సాళువనరసింహారాయలవారి బాల్యమిత్రుఁడను, 'విద్యానగరము'నకు మామిత్రుని రాజకీయ కార్య సందర్భముతో వెళ్లుచున్నాను. ఈతోవ వెంటఁ బోవుచుఁ దమ సంకీర్తనము విని యాఁగిపోయితిని. నాజన్మము ధన్యమైనది. వేంకటేశ్వరపదభక్తులగు నరసింహరాయలవారు తమ సంకీర్తనము విన్నచో నెంత పొంగిపోదురో యనుకొనుచున్నాను.

కొలందినాళ్ళలో నరసింహరాయలవారు తమ దర్శనార్థము విచ్చేయుదురు. వారి మహోద్యమమునకుఁ దమ యాశీర్వాదము, సహకారము కావలసియున్నవి."

౨

సాళువ నరసింహరాయలు విద్యానగర సామ్రాజ్యమునకుఁ జక్రవర్తియయ్యెను. శ్రీ వేంకటేశ్వరస్వామి నిత్యసేవలకు ఫలముగాఁ దాళ్ళపాక అన్నమాచార్యుల యాశీర్వబలముతో బహుప్రయత్నముమీఁద సామ్రాజ్యమును సంపాదించిన శ్రీ నరసింహరాయలను నాంధ్రప్రజలందఱు శ్లాఘించుచుండిరి. నరసింహరాయలకు నన్నమాచార్యులపై నపారమైన భక్తి. ఆతని పరిచయము లభించినప్పటినుండియు నరసింహరాయలకు వేంకటేశ్వర పద పద్మారాధనాసక్తి యభివృద్ధి కాఁ దొడఁగెను. భగవదనుగ్రహము వలనఁ దనకు సామ్రాజ్యాధిపత్యము లభించినదనియు, ఆలాభమునకుఁ గారణము 'అన్నమయ్య' సాహచర్యమే యనియు నరసింహరాయలకు సంపూర్ణవిశ్వాసము కలదు.

రాయలు భక్తిగౌరవములతో 'నన్నమయ్య'ను నందలము నెక్కించెను. అసాధారణ భోగభాగ్యములతో నలరింపఁ

జేసెను. ఒక్క క్షణమైనను 'రాయలు' అన్నమాచార్యుని యెడఁబాటు సహించెడివాఁడు కాఁడు. అన్నమయ్య మధుర మైన కంఠమెత్తి వేంకటేశ్వరునిపై రచించిన సంకీర్తనములు పాడునపుడు 'రాయలు' విని పరవశుఁడై పోవును.

ఒకనాఁడు నరసింహరాయల కోరికపైఁ దాళ్ళపాక అన్నమాచార్యులు భక్తిభరిత హృదయుఁడై యిట్లు పాడుచుండెను.

"ఏమొకో చిగురుటధరమున ఎడనెడఁ గస్తురి నిండెను
భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదుగదా!"

"నాదనామక్రియ" రాగము నాలపించి యీపల్లవి నందుకొనుసరికి సాళువ నరసింహరాయ లానందము పట్టలేక పోయెను. ఆచక్రవర్తి యెంత దైవభక్తికలవాఁడో, అంత శృంగారరసాసక్తి కలవాఁడు. అన్నమయ్య పాట పూర్తియైనది. నరసింహరాయలు "అన్నమాచార్యా! తమ శృంగార సంకీర్తనములు వినుట కెంతో యింపుగా నుండును. శ్రీ వేంకటేశ్వరస్వామివారిపై పాడిన యీ సంకీర్తనముల వంటివి 'విద్యాసగరచక్రవర్తి'ని గూర్చి కూడ రచించి పాడినచో విన వలయునను కుతూహలము కల"దనెను.

చక్రవర్తిమాటవిని 'అన్నమయ్య' తొలుత నాశ్చర్య పడి, కొంతసేపు కసహ్యపడి యిట్లుపలికెను:

"మహారాజా! తమనోటినుండి యిట్టిమాట వెడలునని నేనెన్నఁడు భావింపలేను. పరమేశ్వరుఁడైన వేంకటరమణుని

శృంగారమును వర్ణించువాఁడనుగాని, మానవుల తుచ్ఛశృంగార
ములు వర్ణించు కవినిగాను నేను. మీయభిలాష నావలన
నెఱవేఱదు. క్షమింపుఁడు.”

[illegible] గుండెకు
[illegible] దాను
బ్రహ్మరథముపట్టి, యతనికి ధనకనకవస్తువాహనాదు లొసఁగి,
యసామాన్యగౌరవము చేయుచున్నాఁడు. చక్రవర్తి యాదే
శమును గాదనుట కెన్ని గుండె లుండవలెను! అన్నమయ్యకు
వేంకటేశ్వరునిమీఁదఁ దప్ప మానవమాత్రునిమీఁద లక్ష్యము
లేదు. అతనికి మహారాజాధిరాజు - సామాన్య మానవుఁడు
నను భేద మంతకంటెను లేదు. నరసింహారాయలపై నన్న
మయ్యకుఁ గల గౌరవ మాచక్రవర్తి దైవభక్తిని బురస్క
రించుకొని వచ్చినదికాని యన్యముకాదు. చక్రవర్తి నేఁడు
తన్నుఁగోరిన కోరిక మిక్కిలి క్షుద్రమైనది. దేవతాశృంగార
మును వర్ణించుకొను భక్తుఁడు మానవ శృంగారము నెన్నఁ
డైన వర్ణించుటకు వేడుకపడునా?

శృంగారగానపరవశుఁడైన నరసింహారాయల కాక్షణ
మున నాలోచనమేలేదు. కర్మవశమున నతని నోరు జాఱినది.
అన్నమయ్య తృణప్రాయముగాఁ దన యాదేశమును ధిక్క
రించివైచెను. చక్రవర్తి కోపము పట్టలేక ‘అన్నమయ్యను
శృంఖలాబద్ధునిజేసి ఖైదులోఁ బడవేయుఁ’ డని సేవకుల కాజ్ఞా

పించెను. చిదానందమూర్తియగు అన్నమాచార్యులు నరసింహరాయల యవివేకమునకు నవ్వుకొని, సేవకులువేయు సంకెళ్ళకుఁ జేతు లిచ్చెను.

---

## 3

నిన్నగాక మొన్న విద్యానగరములోఁ గారాగార బంధితుఁడైన అన్నమాచార్యులు నేఁడు 'తాళ్ళపాక' లోని స్వగృహమునఁ గూర్చుండియుండుట కందఱు నాశ్చర్యపోయిరి. సాళువ నరసింహరాయలు తనకిచ్చిన దివ్యసౌధము, వస్తువాహనాదులు, సమస్తము విడిచి నిర్విచారపురుషుఁడై 'యన్నమయ్య' తన యింటియరుఁగుమీఁదఁ గూరుచుండి దివ్యసంకీర్తనము చేసికొనుచుండెను. తిరుపతివేంకటేశ్వరుని కరుణాకటాక్షమునకు లక్ష్యభూతుఁడగు నన్నమాచార్యునకు విద్యానగర చక్రవర్తి వేయించిన యినుపసంకెలలు కనకకంకణములైనవి. కారాగారము పూజామందిరమైనది. బంధితుఁడైన తరువాత విముక్తికొఱకు నా మహాభక్తుఁడు పాడిన పాటలకుఁ గరఁగి తిరుపతివేంకటేశ్వరుఁ డన్నమయ్యను బంధముక్తుని గావించెను. వెంటనే యతఁడు విద్యానగరమున నుండుట కిష్టపడక 'తాళ్ళపాక' చేరుకొనెను.

అన్నమయ్య విచిత్రముగా బంధముక్తుఁడైన వార్త చక్రవర్తికిఁ దెలిసి, యతఁడు తన తొందరపాటునకుఁ బశ్చాత్తాపపడి ప్రాయశ్చిత్తముగా నా భక్తశిరోమణి చరణములపైఁ బడుటకుఁ 'దాళ్ళపాక' గ్రామమునకుఁ బ్రయాణించెను. విద్యానగరచక్రవర్తి వచ్చునప్పటికి 'అన్నమయ్య' సుఖశయ్యలో గోవిందరాజస్వామిని గూర్చి యిట్లు పాడుకొనుచుండెను.

ఉప్పడము కావయ్యా - ఉయ్యెల మంచముమీఁద
గొప్పగొప్పకన్నుల గోవిందరాజా!
పవ్వళించే వీడ వచ్చి - పాయనీ యలవెల్ల
ముప్వంక మేనితోడ ముచ్చటదీర
నవ్వేడి శ్రీపతిచూపు నాటిన చిత్తపు మేన
క్రువ్వని కలువదండై - గోవిందరాజా!
నిద్దురించే వీడవచ్చి నిలుచున్న యలమెల్ల
ప్రొద్దుపొద్దునకుదీర భోగీంద్రుపై
ఇద్దఱు సతులు నీకు నేచిన తాళగతుల
గుద్రేటి పాదములతో గోవిందరాజా!
మెండుగ మేలుకొంటివి - మించిన కౌఁగిటిలోన
కొండుకపాయపుసిరి కోపించగా
ఉండవయ్యా సుఖలీల నుడివోని ప్రియముతో
కొండల కోనేటిరాయ గోవిందరాజా!

* * *

నేనొకండ లేకుండితే నీకృపకుఁ బాత్రిమేది
పూని నావల్లనే కీర్తి పొందేవు.........

నరసింహరాయలు 'అన్నమయ్య' పాదములపైఁబడి, 'మహాత్మా! నీవల్లనే నేను గీర్తిపొందితిని. ఇప్పుడు నీయెడల నపచారముగావించి యపకీర్తియుఁ బొందుచుంటిని. క్షమింపుము' అని ప్రార్థించెను. అన్నమయ్య వినయగౌరవ స్నేహములతోఁ జక్రవర్తిని గౌఁగిలించుకొని. 'మహారాజా! నీవంటివాఁడిట్లు పలుకుట భావ్యముకాదు. ఏదోజరిగినది. అంతయుఁ దిరుపతి వేంకటరమణుని లీలావిలాసము. ఈ పేదభక్తుని యింటికిఁ బెన్నిధానము వచ్చినది. ఇంతకంటె నాకేమి కావలయును' ననిపలికి మధురకంఠముతో నాశువుగాఁ గొన్ని కీర్తనములు గానముచేసి వేంకటేశ్వర సాక్షాత్కారభాగ్యము నరసింహరాయలకును గలిగించెను. ఆ సార్వభౌముఁ డన్నమాచార్యుల మహిమ కచ్చెరువడి చాగిలి మ్రొక్కి యాశీస్సులు వడసి వెడలిపోయెను.

౪

అన్నమయ్య తిరుపతి వేంకటేశ్వరస్వామికిఁ దనవాగ్గేయ వైభవముతో నిత్యార్చనలు సలిపిన ధన్యమూర్తి. అతఁడు తనకుఁ బదునాఱు సంవత్సరముల వయస్సు వచ్చినప్పటినుండియు దినమున కొక్క సంకీర్తనమైనను జెప్పకుండ నుండలేదు. తొంబది యేండ్ల పూర్ణపురుషాయుషము భగవత్సంకీర్తనముతో నతఁడు గడపెను. అన్నమయ్య సంకీర్తనములు ముప్పదివేలకుఁ బైగా నున్నవి. వానిలోఁ గొన్నిమాత్రమే నేఁడు దొరకియున్నవి. రాగిరేకులపైఁ జెక్కఁబడిన వారి కీర్తనములు తిరుపతి దేవస్థానము వారు భద్రపఱచియుంచిరి.

నాదబ్రహ్మోపాసనముచేఁ బవిత్రజీవితముగడపి చరిత్రగణ్యులైన క్షేత్రయ్యకు, త్యాగరాజునకు, తాళ్లపాక అన్నమాచార్యుల సంకీర్తనములు మేలుబంతులైన వనుటలో సత్యోక్తి యుండదు. స్వానుభవమును సరసమధురమైన తెలుఁగుభాషలోని సంకీర్తనములతో వెల్లడించి వేంకటరమణుని కృపావిశేషమునకుఁ బాత్రుఁడైనయన్నమయ్య తెలుఁగునాఁట మాసిపోవని ధన్యమూర్తి.

అన్నమయ్య విశిష్టాద్వైత మతస్థుఁడైనను శ్రీ వేంకటేశ్వరమహిమకు లోఁబడి వైష్ణవమత స్వీకారము చేసినవాఁడు. అహోబలమఠమున కధిపతియగు ఆదివన్ శఠకోపయతి

యన్నమాచార్యుల వైష్ణవగురువు. అన్నమాచార్యులకుఁ బెదతిరుమలాచార్యులను పేరుగల కుమారుఁడుండెను. ఆయన రచించిన కీర్తనములుకూడ నెన్నో తామ్రశిలాశాసనములలో లభించినవి.

చక్రివర్తి సాళువ నరసింహరాయులవంటి వానినేని లెక్కసేయక,తనమానసము నిరంతరము శ్రీ వేంకటరమణునిపై నిలిపియుంచి, అర్చావైభవముతో భగవంతుని సాక్షాత్కరింపఁ జేసికొని, నిండుగాఁ దొంబదియేండ్ల పవిత్రిజీవితయాత్రి సాగించి, ప్రతిదిన సంకీర్తన రచనా ప్రితిజ్ఞ సాధించుకొని 'పూనినావల్లనే కీర్తిపొందేవునీవు' అని వేంకటేశ్వరుని యెదుట నిర్భయముగాఁ జాటిచెప్పి ముప్పదివేలకు మించిన దివ్య సంకీర్తనములతోఁ దెలుఁగు ధరిత్రిని బవిత్రము గావించిన చరిత్రధన్యుఁ డన్నమయ్య.

జాతిభేదములు కూడదని విశ్వసించిన 'అన్నమయ్య' రచించిన యీపాట యెంత సొగసుగా నున్నదో చూడుఁడు.

విజాతులన్నియు వృథా వృథా
అజామిళాదుల కదియే జాతి.
ఎక్కువకులజుఁడైన హీనకులజుఁడైన
నిక్కమెఱింగిన మహానిత్యుఁడే ఘనుఁడు
వేదములు చదివియును విముఖుఁడై హరిభక్తి
యాదరింపని సోమయాజికంటె

పదియును లేని కులహీనుఁడైనను విష్ణు
పాదములు సేవించుభక్తుండె ఘనుఁడు.

పరమగు వేదాంతపఠన దొరకియును సదా
హరిభక్తి లేని సన్యాసికంటె
సరవిమాలిన యంత్యకులజుఁడైన
నరసి విష్ణుని వెదకునాతఁడే ఘనుఁడు.

*   *   *

తన సంకీర్తనముల చౌర్యముచేసినవారిని దూషించుచు అన్నమాచార్యులు రచించిన యీ పాటలోని హాస్యరస మాధుర్యము నాస్వాదింపుఁడు.

వెట్టులార! మీకు వేడుక కలిగితేను
అట్టువంచి తడు కల్లంగరాదా?
ముడిచివేసినపువ్వు ముడవ యోగ్యముకాదు
కుడిచివేసిన పుల్లె కుడువగా రాదు—
బడి నొకరు చెప్పిన బ్రతిచెప్పబోతేను
అడరి శ్రీహరికి నది అరుహముకాదు—
ఉమిసిన తమ్మలో నొకకొంత కప్రము
సమకూర్చి చవిగొని చప్పరించనేల—
అమరంగ ఛాయాపహారము చేసుక
తమమాట కూర్చితే దైవము నగడా?—వెట్టులార!

శ్రీ వేంకటేశ్వరస్వామి కరుణాకటాక్షమునకుఁ బాత్రుడవై, ఆదర్శమైన భక్తియోగమును మేలుబంతిగా మాకం దిచ్చిన మహాత్మా, అన్నమాచార్యా! నిన్నుఁగీర్తించి ధన్యత సంపాదించుకొందుము.

---

రాయుల ముద్రణాలయము, తణుకు. అక్టోబరు — 1954.